తాలహింతాలతమాలకృతమాలనక్తమాల మాతులుంగలవంగ
నారంగజంబూదీమధూకపిచుమంద మందారకరవీరకోవిదారాశోక
నాగపున్నాగకేసరశిరీషబంధుజీవ కపిత్థకాంచనకపిలాంగకవట
కుటజనిచులకురంటకఖదిరఖర్జూరక్షీరవృక్షాది నానావిధానూనా
నోకహసందోహదేహవేల్లల్లతావితానవిద్యోతమానసామదేశో
పశోభితంబును, బహువిధవిటపివిటపపటలాంతరితహారిహారీత
పారావతలోహపృష్ఠవ్యాఘాటదార్వాఘాటసారంగపేచకశిఖండ
కలవింకకారండవటిట్టిభకకులింగ ప్రముఖవివిధవిష్కిరపుష్కల
గళమంగళకూజితపీచీకూచీవిరాజితంబును, సింహశరభసైరిభ
భల్లభల్లూకశార్దూలవరాహగజగవయ గండకతరక్షుప్లవంగ
మైణశల్యశ్వాపదసమావృతంబును, నైకవిధనైనవిధఖగమృగ
గళరవబహుళబధిరితదిగంతరాళంబును; దంతురితాంధకారవార
పరిశోభాస్పదంబగుటం జేసి, యవిదితదివసమధ్యవిద్యోతితాతప
వైశిష్ట్యంబులైన మేరుశైలశృంగంబుఁ జేరి, యహోరాత్రిసంచరవీసుందా
శ్రమంబొందుగల్పించుకొని, వివిక్తంబైన యశాయందుం
బొచ్చి. గురూపదిష్టదిష్టంబున నేదిష్టదిష్టసాధిష్ఠనిష్ఠసిద్ధినాశించి
నిష్ఠాగరిష్ఠమార్గంబు నూలువాసియుపీనరవోపనీయకపాటించుచు
నిరతి ఘోరగ్రామంబునిర్జించి, దుష్కరంబైన తపశ్చర్యకునగపంగె
నెట్టులనన ॥ 597

ఆ॥ గ్రీష్మకాలమందు పూపప్రభార్చిష్మచ్చ
తుష్కమధ్యసుస్థితుండుతండు
సూర్యబింబముఁదుఁజూడ్కులనిల్పి, పం
చాగ్ని దీక్షతోఁ; దదత్యయమున ॥ 598

ఆ॥ వానకాలురాఁగ, దానవనాథుఁడా
కంఠఘ్నముగ, నకుంఠితగతి
నుండితపమొనర్చె నుపవాసతత్పరుం
డంబుభక్షణుండునగుచు, నగుచు ॥ 599

ఆ॥ కేలఁగూర్కుమాని, కాలంబుఁబుచ్చుచు,
సీతుకాలురాఁగ, నాతపంబు
సోలనిచోటనిల్చి, సురవైరినిశలనా
వృతుఁడు, గోచిపాతయే ధరించి ॥ 600

ఆ॥ చేసెఁదపముఁ నిష్ఠశీతవాతాహత
తనుఁడు వాయుభక్షితాజితేంద్రి
యత్వఘనుఁడతండు ధ్యానధనుండునై
బ్రహ్మనిష్ఠుఁడై, స్థిరత్వమూని ॥ 601

వ॥ సర్వనాడీనిరోధంబును, దశప్రాణనియమంబును, మనోనైశ్చల్యంబు నంబూని, నూఱువేలేండ్లు దారుణంబైన సమాధినుండి, నిరామయంబుగా బ్రహ్మధ్యానపరాయణుండై, యోగమార్గంబునన్ బ్రహ్మనాడిం బ్రకోపింపఁజేసి, నిరామయుండును, నిర్గుణుండును, అవ్యయుండును; లోకాధినాథుఁడును, లోకగురుండును, పరేశుండును, సదానందుండును, జ్ఞానానందుండును, మహానుభావుండును, వేదవేదాంతవిద్యాదివేత్తృగమ్యుండును, వేదవేదాంతవేద్యుండును, వివిధవిబుధజనగణవిచింత్యుండును, అనంతుండునైన వాణీప్రాణేశ్వరున్ ధ్యానించుచు, నిశ్చలతపశ్చరణంబునన్ గాలంబుఁబుచ్చుచుండె-నని తెలుపుటయును॥

కం॥ సిరిమగఁడుములికిగా, బం
గరుగట్టదిగట్టివిల్లుగాఁ, దగఁబ్రోల్గ
బ్బురముగఁగూల్చినయోగం
పరగండఁడ ! కపిలమల్ల ! నరసపురేశా !! 603

ఇది, ఆంధ్రీకృతము క్షేత్రీశ్వరోపాఖ్యానంబున,
జానుమండలతపోవర్ణనమను
ప్రథమాధ్యాయము.



శ్రీరస్తు

# ఆంధ్రీకృత ముక్తీశ్వరోపాఖ్యానము

## ద్వితీయాధ్యాయము



మద్ధైమవశైలే
జ్జామాతా! మాతృభూతసంజ్ఞాఖ్యాతా!
భూమకరుణానివేశా!
భీమేశా! నరసపురకసిలమల్లేశా!! ॥ 1

ఆ॥ అవధరింపుమవల; నమరమునీశ్వరుం
డడిగె; నలువనిట్టు "లనఘ! జాను
మండలుండొనర్పఁ జండతపంబెట్టు
లూఁకొసిరి త్రిదశులుద్దవిడిని? ॥ 2

ఆ॥ అతనితపముఁ జెఱుప, నమరులు దివ్యాప్స
రఃకదంబ మంప, రక్కసుండు
విఘ్ననిఘ్నుఁ డై, పవిత్రదీక్షను వీడ
కుండెఁ జంచలత్వమూనకెట్లు?॥ 3

ఆ॥ వానికంటె మున్ను దానవుల్ పెక్కురు
"నిష్ఠనీరుగాఱ", నియమముడిగి,
విఘ్ననిఘ్ను లైరి; వీఁడు జానుమం
డలుఁడు చెఱుపు లేక, నిలిచె నెట్లు?" ॥ 4

వ॥ అనియడిగిన, నలువ కొడుకునకిట్లనియె॥ 5

ఆ॥ వినుము; వత్స! యుల్లుదనుజుఁడు మేరుశృం
గమునఁ దపమొనర్ప, నమరులమర
పతికిఁ దెలిపి రతనివార్తలఁ దావిని,
యదిలఁ గొని యెమిగుఁ మనతండు ॥ 6

ఆ॥ శతముఖుండు ప్రసభజర్జరచేతనుం
డగుచు, దొర్లి పడ్డయసురబాధ
లొక్కమాఱుమదిఁదళుక్కునమెఱయఁగా;
నేమిదోఁపకుండెఁదా మతిచెడి॥ 7

ఆ॥ చిత్త,శల్యమదియు; నుత్తలపాటుని
ప్పటికిఁగలుగఁజేయుఁ; బటిమఁజెఱుచు;
నమృతలాభమందకసురులనేకులు
పోరిచాలలేక, పాఱి, యంత॥ 8

ఆ॥ దితితనూజులందుహతశేషులును, గ్రూరు
లైనకొందఱేమియాగడంబు
మాకొనర్పఁదాముమదిఁదలంచిరో! తలఁ
పఁగను, దోఁచునులికిపాటునాకు॥ 9

ఆ॥ మఱియు, దైత్యవంశమండనుండా జాను
మండలుండొనర్చు మహితతపము
మదికినుదుకుఁగూర్చు; మఱిమఱివిన, మహా
ద్భుతము,వానితపమపూర్వమంట॥ 10

ఆ॥ జానుమండలుండు సజ్జనసంఘంబు
సంతతంబునియమసాధితోద
యాఢ్యుఁడౌచుఁగూర్చు హానిదుష్టాత్ముఁడై;
యుద్ధతాత్ముఁడై, మహోగ్రుఁడౌచు॥ 11

ఆ॥ లోకమందువిద్య, లోకోత్తరమహాత్త
విత్తమమలతపముసత్త్వములకు
వృద్ధిఁగూర్చు; నివియెయుద్ధతాత్ములకు స
ర్వక్షయప్రదంబులౌక్షితిపయి॥ 12

ఆ॥ కాన, యత్నపూర్వకంబుగా, జానుమం
డలు సమాధిలోకనాశకరము
మాన్పనౌను; సత్త్వమప్రీతి, త్రైలోక్య
రక్షణంబుగల్గు నీక్షణంబ॥ 13

ఆ॥ ఆకుబుద్ధి నాకలోకాధిపత్యార్థ
మాచరించు ఘోరమైన తపము;
నంచు, నిశ్చయించి, యాఖండలుండు త
ద్విఘ్నమెట్టులనుచు, వెదకె మదిని॥ 14

ఆ॥ ఒకవినిశ్చయంబునకువచ్చి, వజ్రి సిం
హాసనస్థుఁడై, దివౌకసులను
గూడి, కొల్వుదీరి, పైఁడిబొమ్మలఁబోలు
లలనలంత తనను బలసికొలువ ॥ 15

ఆ॥ వజ్రహస్తుఁడప్పువారినెల్లరంపీడి,
వేయుఁగన్నులుద్దవిడివసంత
సహితుఁడయినకుసుమశరుపయింబఱపెను
త్పలపలాశమాలికలనుబోలె ॥ 16

ఆ॥ కంతుఁడంత మొక్కె-సంతోషితస్వాంతుఁ
డై, నిటాలసుఘటితాంజలియయి;
పినపఁ, ద్రిదివపతియుఁ, బ్రీతిమైనత్యున్న
తాసనార్ధమందునతనినిలిపె॥ 17

ఆ॥ కుసుమశరుఁడుదెలిసిగోత్రారియాన్నత్య
మతనిహృదయమునకుఁగుతుకభరముఁ
గూర్చునేర్పుగల్గి, కొసరియిట్లనిపల్కె-
వినెడు సురలమదులవింతదోఁప॥ 18

ఆ॥ "త్రిభువనాధినాథ! త్రిదశేశ! నీకింక
రునిననుగ్రహించుటనఁ గ,నఘ!
గూనతీయవలయు, నవసరంబేమొ;యు
య్యదియె ప్రభులకుచితమదియెదయయు॥ 19

ఆ॥ అధిప! యాత్మతుల్యమైనకార్యమున నీ
దాసునుద్యమింపఁజేసి; ధన్యుఁ
గాననుగ్రహింపు; గౌరవించుటభృత్య
కోటికడియగడ! యకుంఠవజ్ర!॥ 20

ఆ॥ ఎవఁడుగాని నీకనిష్టభూతుండు, ని
ష్ఠాగరిష్ఠుఁడై, ప్రశస్తిఁగాంచు,
నాబలాఘ్న్యనిష్టైనబలాకటాక్ష వీ
క్షణఖలీనలీనతనునొనర్తు ॥ 21

ఆ॥ ఎవఁడుగాని, నీదయిన పదంబును బొందఁ
గోరి, క్రతు, శతంబపారలోభ
పరతఁ జేయఁబరఁగు, వాఁడు నారాంగనా
ధరసుపారసంబుమరఁగుఁగాత! ॥ 22

ఆ॥ ఎవఁడుగాని, నీదయిన సంపదాళి ని
లింపనాథ!, కోరి, యింపుమీఱి
యుగ్రతపమొనర్చు, నువిదల కెమ్మోవి
నాన యోగవిఘ్నమానువాఁడు॥ 23

ఆ॥ ఎవఁడుగాని, వీడిభవనపుత్రకళత్ర
భృత్యసంపదాళి నిత్యమోక్ష
కాంక్షఁ "గాంచనన్ని," శాంతుఁనీవీని
మోక్షలోలుఁడౌనుబొమ్ము వాఁడు॥ 24

ఆ॥ ఎవఁడుగాని, నీకనిష్టభూతుండు బా
హ్యవిషయములవిడిచి, యల్లప్రత్య
గాత్మనిల్పనీయ మంతరంగంబు, వాఁ
డంగనాతిసక్తుఁడౌనుజూవె! ॥ 25

ఆ॥ వృత్రశత్రు! యెవ్వఁడతిస్తుఁడై, ధర్మ
మర్థమోక్షములె పుమర్థములుగ
బుద్ధినెంచువాఁడుముగ్ధలపాలింట్లఁ
బట్టుకొక్కెనుండువాఁడుగాదె!॥ 26

ఆ॥ రెండెసాధనములు త్రిదశేశ! నాకు నీ
శాసనంబు, సుమశరాసనంబు;
వీనిచేనసాధ్యమైనదేదియులేదు;
దుర్గమంబులేదు; స్వర్గినాథ! ॥ 27

ఆ॥ చెప్పరాదె, దేవ! "సిగ్గు చిందులు ద్రొక్కు"
కన్నెఁ జెనిమిఁడఁగన్ను వైచి
తాఁశుభాంగి, యౌవనారూఢఁ, ద్వత్కంఠ
సక్త బాహఁ జేయఁజ లనొక్కొ!॥ 28

ఆ॥ ఏమి, యెవతెనేనిఁ గామించితే, పతి
వ్రతను? త్రిదివనాథ! త్వత్పదాబ్జ
పతితఁ జేయువాఁడ, వ్రతభంగమొనరించి,
సురతయాచనైకపరతనామె॥ 29

ఆ॥ పంపునన్ను దేవ! వైళంబ త్వన్ని దే
శంబుఁదీర్చి, పుష్పచాపమిద్ది
ధన్యమౌ తెఱంగు, ధన్యుఁడనేనౌ తె
ఱంగుఁగాంచువాఁడ; రజ్జుగాదు॥ 30

వ॥ అని, పలుకుసుమశరునిం గనుంగొని, కనుంగొనల మందహాసరేఖలు "దోబూచులాడం" ప్రాజ్ఞతల్లజుండైన గీర్వాణవల్లభుఁ డల్లనల్లన నిట్లనియె॥ 31

ఆ॥ "ఔను; మీనకేతనా! నీవచఃప్రకా
రంబు సత్యమే; శరంబు పొప్ప
మెచ్చకైనఁ జొచ్చనీయది; నీయది,
సోఁకరాని తావు ధరణిఁ గలదె?॥ 32

ఆ॥ నాదు వజ్రమెన్నఁగా, దూరతస్థాయి
కుంఠితంబు; శ్రీవికుంఠనాథ
పుత్త్ర! సర్వగామి, ముఖ్యసాధకమహా
స్త్రంబవీవె నాకు; శంబరారి!॥ 33

ఆ॥ నీపరాక్రమంబు శ్రీపుత్త్ర! నేనెఱుం
గనె? యనన్యసాధ్యకార్యమౌట;
నిన్నుఁ బంపుచుంటి, నిఖిలలోకోపకా
రార్థమదియు; మదన! స్వార్థహీన! ॥ 34

చం॥ విదితమకాదె, నీకుఁ! బ్రిభవించెనుభాఽభిధహాపథం
బదియుఁబయఃపయోధిఁ; గుసుమాయుధ! దానిని దేవతాతతిన్
సదయుఁడుదావ్రఁజేసెహరి; సత్ప్రపరీక్షలపోషవిక్రముల్
త్రిదశవిరోధులన్ జదిపె శ్రీహరి వేళ్లఁజక్రధారలన్॥ 35

ఆ॥ అసురులందు మదన! హతశేషులన్ జాను
మండలుండు, ధైర్యమండనుండు
నిగ్రహించి, యింద్రియగ్రామముజయించి,
చేయుఘోరతపముజేయుఁడతఁడు॥ 36

ఆ॥ దైత్యుఁడిచ్చగించు త్రైవిష్టపశ్రీ బ
లాద్గృహీత, సూక్ష్మలప్రతాపుఁ
డౌనుజానుమండలాఖ్యుండు, దుష్టుండు;
తపమొనర్చి, మఱియు దర్పమొందె॥ 37

ఉ॥ నీవు, మధుద్వితీయత, ననిందితపౌరుషభూషణుండవై,
శ్రీవరనందనా! మదన! శీఘ్రమెయూర్వశి,రంభ,మున్నగా
దైవతయావతంబునుముదంబునఁజేకొని, జానుమండలున్
భావినుతప్రతాపమునమూఘునిఁజేయ వెళ్లెదిగాగ్రహన్?॥ 38

ఆ॥ వినుము; మదన! నిజము; దనుజుండు నిష్ఠాగ
రిష్ఠుఁడైనఁదత్ప్రకృతిచలంబు;
గానఁ, గామబోలు వానిగెల్చుట, తపః
క్షయమొనర్చుటన, నశక్యమెట్లు? 39

ఆ॥ వానితపముక్షయముగా నౌనుత్రైలోక్య
మంగళంబుసౌఖ్యమింగితజ్ఞ!
యట్లుగాక, సిద్ధియబ్బెనే, వానికి,
లోకనాశమగును శ్రీకుమార!॥ 40

ఆ॥ కార్యమిద్దిసేయఁగల్గుదునీవు; ధ
న్యుండవౌదువింక, నొండుమాట
దక్కి, పొమ్ము; కీర్తిదక్కునులీవు; స
త్యమ్ము; పుష్పబాణ! నమ్మమయ్య!॥" 41

ఆ॥ అనుమహేంద్రువాక్యమాలించి, సంతుష్టుఁ
డై, రతీశుఁడనియెనమరపతికి
"దేవ! కింకరుండ; నీవానతిచ్చిన
ట్లాచరించి, మెప్పులందువాఁడ ॥ 42

ఆ॥ హరియు, హరుఁడు, బ్రహ్మ, యఖిలామరులు మునుల్
మానవాదులెల్లమానవాదు
లస్మదీయబాణహతినిర్జితుల్ గారె!
జర్జరితులుగారె ! నిర్జరేశ ! ॥ 43

కం॥ మునుబదరీవన, నారా
యణముని, పురుషోత్తముఁడు, తపోఽధికుఁడు, మదీ
యనిశాతబాణపాతం
బున, స్ఖలితసమాధిగాఁడె ! పుణ్యచరిత్రా ! ॥ 44

కం॥ మృత్యుంజయుఁడు, పినాకి, దు
రత్యయమద్బాణపాతమదియెదలో, ని-
ష్ప్రత్యూహంబుగనాటిన,
నత్యార్తధృతి, సామిదేహమాలికొసఁగఁడే ? ॥ 45

ఆ॥ తనదుతనయమరఁగెఁదమ్మిచూలి, పితామ
హుఁడు, సృష్టికర్తయొండుదక్కి-
నున్నిశాతబాణమున్నిద్రమై, నాటఁ
గాఁడె, నాఁటనోలెఁగ్రితుభుగీశ ! ॥ 46

ఆ॥ శర్వసన్నిభుండు, సర్వతత్త్వార్థద
ర్శకుఁడు, మునివరుఁడు, పరాశరుఁడు, పు
రాణసారవేత్తరమియింపఁడే, దాశ
కన్యఁబట్టితొల్లిశూన్యుఁడౌచు ॥ 47

ఆ॥ ఎంతతపమొనర్పనేమి ? విశ్వామిత్రుఁ
డుండెబద్ధుఁడై, మహోజ్జ్వలంబు
లైనమేనకాదృగావలీవాగుర,
ననఁగ, మచ్ఛరప్రహారములనె ॥ 48

ఆ॥ ఋశ్యశృంగుతండ్రి, పశ్యల్లలాటతు
ల్యుండు దా విభాండకుండుతొల్లి
యిట్లెసలక్షమొందఁడే, రంభకుచకుంభ
మొత్తిగాఁగిలించునోడుపులఁబడి॥ 49

ఆ॥ నాకనాథ! సర్వలోకంబుఁ న్ గామి
నీనిశాతదృష్టి, సూనబాణ
వృష్టిఁ దెఱలువాఁడ సృష్టిలోనన్నాఁడె?
నాదువచనమిదియుఁగాదు పొల్లు॥ 50

ఆ॥ సంశయింపనేల? సాధింతు నే దేవ
కార్యమిద్ది; నన్ను వార్యపీర్యుఁ
బంపుమిప్డె యో నిలింపవల్లభ! భవ
చ్ఛాసనంబొనర్ప స్వర్గనాథ! ॥" 51

వ॥ అని, పలుకుమదనునివచనములువిని, శతమఖుఁడును, ముదిత
హృదయుఁడును, సదయుఁడునయి, యతనినినిజకరకిసలయమున
గ్రహియించి, మృదుమధురవచనరచనలనిట్లనియె॥ 52

ఆ॥ ఎఱుఁగుదేనునిన్ను; విరివిలుతుండ! నీ
వంతవాఁడవౌదు; హరాంతకారి!
పొమ్ము వేగ; భద్రములుగల్గునీకు; నె
ల్లెందు, సురలమెప్పులందుమోయి!॥" 53

ఆ॥ అనుచుఁ బ్రోత్సహింప,నమరేశ్వరుండు, మీ
నాంకుఁడంత,నిజగృహంబుఁ జేరె;
రతికిఁ,దనదుసతికిఁబ్రాణైకమూర్తికిఁ
జెప్పిపోవువాఁడు, శ్రీసుతుండు॥ 54

వ॥ అంత, శచీకాంతుండును, గార్యత్వరాకృష్యమాణ
స్వాంతుండై, లేచి, సత్వరంబుగస్వర్వేశ్యావాటికన్ జొచ్చి,
యందొక్కదివ్యమందిరంబునవున్న దాని, సంగీతభంగీతరంగిత
సాహిత్యసాహిత్యచాతుర్యధౌరంధర్యంబొప్పు దాని, ఘనఘనా

ఘనసంకాశ కేశపాశోపశోభితయైనదానిం, జందాద్రిద్ధివ్యర్థీకృ
తఫలవీలాలాలిత్యనుత్యయైనదాని, సంపూర్ణపూర్ణిమాచంద్ర
మండలమండనాయమానాననమంగళలక్షణ
లక్షితయైనదాని, నారేచితభ్రూవల్లరీవేల్లితముఖలవణిమామి వుల
వెలయుదాని, శతపత్రపత్రాయతనేత్రప్రాకృద్ద్రక్పతతులంబ్రసరించు
చున్నదాని, రత్నకుండలరుచినిచయమండితగండయుగళమణి
ముకురయుంగళభంగీశృంగారతరంగరేఖానిరాఘాటాంగీకార
ము నాస్రిముద్రితశ్రీ సాకారశోభితశోభితయైనదాని, మొల్ల
మొగ్గలమొత్తంబుల నుత్తలపాటొందించుదంతపంక్తులకాంతులకు
మందహాసదీప్తులుక్రొత్తవెల్లులవెల్లువలీయుచుండ, బింబోష్ఠ
బృంహితమహితతారుణవీధితులదాడిమబీజపంక్తిచ్ఛాయాదా
యూపత్వంబుసంపాదించియుందించుచుండుదాని, మదనవిజయ
మంగళశంఖశోభానిశ్శంకవిజిగీషావిశేషభూషితలావణ్యధురా
బంధురకంధరాశ్రీధురీణయైనదానిమణిగణఖచితవలయకేయూర
రాజత్పాణిపల్లవబాహావల్లరియైనదానిం, గనకకలశయుగళపరి
హాసనచణసుదృఢపృథుల పీనోత్తుంగవక్షోజద్వంద్వమందానన్య
నన్యసామాన్యమాన్యరమ్యత్వగన్యయైనదాని, గంగాZZవర్త
సనాభిగంభీరోప్వలత్రాధార్ధోన్నిద్రసంభద్రహల్లకకోరకాభి
రూపత్వస్ఫీతనాభియైనదాని, పీవరపృథ్వోరుకాండనిర్జితరంభాస్తంభ
పేశలశుండాదండమండితయైనదాని శాలిగర్భసగర్భనిర్భరంశోభా
శాలిజంఘాంఘ్రితకాహళహాళహాళికయైనదానిం, క్వణత్కింకిణీ
స్వనస లచ ణమూపురసహచరక్రీడా సక్తరంగవిహంగభంగా
యూతసంసక్తకలహంససంసత్సఖ్యకృతకేళికారాతంకా
నంగీకారచేతోZంతరయైనదాని, ననంగవిద్యావైశద్యవైశారద్యంబుల
నొప్పుదాని, సింహమధ్యను, విద్యుదుద్యదుజ్జ్వలశోభాZతి
శాయిని, నూర్వశ్యభిధేయనుజూచి, తదత్తరత్నభూయిష్ఠ
మహాసనంబునసుఖాసీనుండై, సునాసీరుండు తత్కరార్పిత
కర్పూరతాంబూలంబునందుకొని, తత్పాణిధృతచామీకరదండ

మండితచామరసామోదసంవీజితుండై, విజితశ్రమ్ముండై, తదంగ
ప్రత్యంగప్రత్యగ్రబాగ్రఁ దామణీయకంబాసేచనకంబుగాఁ,
దనవిభూతివిశేషములన్ "దొబూచులాడు" మనోనయనంబులనాచి
చూచి, సమీచీనంబుగా నిట్లనియె ॥ 55

తే॥ "కమలపత్రాక్షి ! నీకుఁగుశలంబె కద ! సర్వ
తోముఖంబుగాఁగ, దేవవనితలు
కరము సేవఁజేయుదురె, నీకుఁ బొరపొచ్చె
మేమి లేక?" యని, మహేంద్రుఁ డడుగ ॥ 56

తే॥ ఆమె వల్కనించుకంత లజ్జారేఖ
దోఁప, సస్మితాస్యయై, పురంద
రునకు వినయఘటితరూఢంబుగా, గాఢ
భక్తియుక్తయౌచు, రక్తయౌచు ॥ 57

తే॥ ప్రభు! సహస్రనేత్ర! త్రైలోక్యనాథ! మీ
యాదరావలోకనాతిమాత్ర
లాభమొందువారికౌభవికంబులు;
సంశయింపనేల? స్వర్గనాథ ! ॥ 58

తే॥ మీయనుగ్రహమున మేనకాద్యప్సరః
కాంత లెల్ల సఖ్యమంతరంగ
మందు నిల్ప, నాదు ఛందంబు ననుసరించి,
సంచరించుచుంద్రు సంతతంబు ॥ 59

ఆ॥ ఇది యపూర్వమో మహేంద్ర! యత్యద్భుతం
బింటికీవు వచ్చి, యిట్లు మాట
లాడునాడు దాని దౌర్భాగ్యఫలంబు స
హించుటది దరిద్రదశ నచ్చుచు వజ్రి ! ॥ 60

వ॥ ప్రభువులకుం బరిగ్రహంబులయందు స్వాతంత్ర్యంబు సర్వతో
ముఖంబుగదా! వారిచిత్తం బెప్పుడెచ్చట ముచ్చటం బొందుచుండు
నచ్చట విచ్చలవిడిం బుడమిలోకపక్కియొక్కువమక్కువ మెయిన్
వచ్చుచుం, బోవుచుందురు. ఇదియె, మణిమయసదనంబు.

ఇవియె, కాంచనాంచితంబులైనమంచంబులు. ఇదియె, కల్పకారామంబు. ఇవ్వియెరత్నపంజరంబులు. సర్వభూషాభూషితంబైన యోషాసహస్రంబిదియె. ఈదాసురాలిసేవలంగీకరించి, సముచితకార్యంబులన్ యథేచ్ఛంబుగా వినియోగింతువుగాక! ఇందున్నయున్నతోన్నతవైభవప్రాభవంబులన్నియున్ భవదధీనంబులెగదా! భవదాగమనంబునన్ననుగ్రహించుటకేయని, గ్రహింపనేరనిదానంగాను. సముచితోపచారంబులొనర్పనాకాదేశించి, ధన్యురాలిం జేయ వేడుకొనుచున్నదాన. భృత్యవర్గంబు నిత్యంబు పత్యర్థనిర్వహణనూర్వహనసమర్థంబై యుండనభ్యర్థింతుంగాదె!" యనిన, విని, శతమఖుండాశశిముఖికిట్లనియె ॥ 61

ఆ॥ "సలితాంగి! నీవు శాలీనతాశాలి
వైనమాట సెప్పితదియు, నీదు
నాభిరూప్యమునకు ననుగుణంబ, సురూప
ముండుచోట గుణములొప్పుచుండు ॥ 62

ఆ॥ నీదియెల్ల నాదిగాదె కో! తత్స్వతం
త్రతను జేసి, నిన్ను రమణి! యొక్క
నోడ్డపనికిఁ బంపుదును; గాని, దానినీ
వెట్టుటెనఁ, జక్కఁ జెట్టవలయు ॥ 63

ఆ॥ నిజము; తరుణి! రిపులువిజిగీషులును, వ్రత
క్రతుసమాధిపరులుఁ గాన, వారి
గెల్వ నవిదివజ్రకీలితహస్తుండ
నైనఁ గాని, నాకుహరిణనయన! ॥ 64

ఆ॥ తన్వి! నీవయాయుధంబవు దైత్యులగెల్వ నాకు; సముదకిరవాణి
వాలిష్టపిష్టదారుణంబుగ మేరుశృంగమండుదపముఁ జేయుదురట!

ఆ॥ జానుమంతుఁడనెడు క్షణదాచరాగ్రణి
ఘోరతపము నర్చి, సారలక్ష్మి
బలిమిఁ గానఁగ మదినిదేఁ చుచుండుటఁ గంట
గించుఁ దలయుమాకు; మించుబోణి! ॥ 66

ఆ॥ అసురులమరులతివ! యత్యంతసాపత్న్య
మేడుగాలమొంది, కీడొకల్లొ
కల్లొనప్పుకొనుటె, పల్లవోష్ఠి! మహో
ల్లాసమానువారలకు; ధ్రువంబు ॥ 67

ఆ॥ అసురకసిమసంగునెనరేగి, సురల, స
మాధియందుసిద్ధియబ్బెనేని
దుష్టులెల్లరకునుగష్టప్రదుల్; వారి
తపముపంత, వారిధార్ష్ట్యమెచ్చు ॥ 68

ఆ॥ కనుక, కనకగాత్రి! కాలాతిపాతంబు
సేయకీవు మేరుశృంగసీమ
కేఁగితత్తపంబుసేగినొందింపుమీ
దింపుమీ, సురాళిదీనదశను ॥ 69

ఆ॥ నీకునన్మథుండు వీఁకసహాయుఁడౌ;
మాధవుఁడు, మలయమారుతంబు
చందమామ, భ్రమరసముదయంబు, పికాదు
లెల్లవత్తురబల ! పిల్లురేగి ॥ 70

ఆ॥ తన్వి! సాలుదీవ, తద్ధైర్యకంచుక
చ్ఛేదనమునకీవుసాదరముగఁ
జూడ, నెవఁడుధైర్యశోభితుండౌ, నిబ్బ?
నిచ్చకంబుగాదు; మచ్చెకంటి!" ॥ 71

ఆ॥ అనుమహేంద్రుఁజూచి, వనితావతంసంబు
వలికెవినయగరిమ "ప్రభుప్రసాద
మునను జేసిలోకమునదుష్కరంబేమి ?
త్వన్నియోగమొకటియున్నఁ, జాలు ॥ 72

ఆ॥ త్రిపురదహనునయిన, నపగతధైర్యుఁ గా
వింపవలఁతినే; నిలింపనాథ !
కామకాతరుండు, స్థిమశూన్యుఁడు, కీన
వెలితి యనుచుఁజెప్పవలెనె, వేఱ ?" ॥ 73

వ॥ అని, పలుకుచిలుకలకొలికిపలుకులువిని, తనివోఁగొని, యమర
పతినందహాసితసితముఖుండై, గద్దియదిగ్గనడిగ్గనుఱికి, సాధు
వాదంబులతోడరినాదరించి, "పోయిరమ్మని" పల్కి, యామెను
వీడ్కొల్పె నంత ॥ 74

ఆ॥ ఊర్వశీసమాఖ్య, స్వర్వేశ్య, సర్వగీ
ర్వాణనాథు, నిండుఁబ్రణతిఁ జేసి
తత్కరాహితంబు, సత్కారముక్తాస
రంబుఁ గంఠసీమకింపొనర్ప ॥ 75

ఆ॥ ప్రీతిఁదాల్చి, యాదరింపనిండుప్రిండు, దాఁ
గేళిమందిరంబుఁ గీరవాణి
జొచ్చి, సఖులునన్నుఁ జుట్టునుగొల్వ, భూ
షణవిభూషితాంగి సొరుమీఱ ॥ 76

చం॥ ఘుమఘుమలాడుమాల్యములు, గోరినవన్నెలవిన్నవల్వలున్
గమలదళాక్షి మేలయినగందపుఁబూఁతలుఁదాల్చి సొమ్ములున్,
సుమశరుఁడున్, వసంతుఁడుఁ దనున్ గడునాదృతిఁ గొల్వ యావతం
సమితవిభూషితంబయి, సమావృతఁ జేయఁగఁ దన్నుఁ జేరఁగన్ ॥ 77

వ॥ తారకారాజిమధ్యంబునన్ విరాజిల్లు చంద్రరేఖయుంబోలె శోభిం
చుచు, విద్యుల్లతావిరాజమానంబై నదోయవీథియుంబోలెనొప్పా
రుచు, నానాఽనూనవృక్షాకీర్ణంబును, బహుళవిహంగకులకల
కలకలరవగళముఖరితంబును మనోహరంబునైన మేరుశృంగంబుఁ
జేరి, యనేకకరమ్యాతిరమ్యంబైన స్థానంబున వసంతసమా
క్రాంతంబును, చూతమంజరీసంసక్తమత్తానురక్తభృంగీభృంగ
ఝంకారసంకులంబును, పల్లవలవాస్వాదనకషాయకంఠసంగాయ
త్కలకంఠకులకంఠకలకోమలకాహళీనుకారిసహకార
కోలాహలాకులంబును, పుష్పవ్యత్స్ఫుటలసంసర్గసుగంధిలలితానిల
కుమారసుకుమారపరిసారసారంబును, మరున్నటసమాదిష్టదిష్టోప
దిష్టమంజరీనృత్యమంజుళంబును, వికసత్కుసుమసమాకీర్ణాభ్యర్ణ
వల్లీవేల్లితపాదపంబును, పల్లవోద్గమపట్టోద్గమసీమాంశుకాంశు

కమనీయహరితపరిస్తీర్ణంబును, వాసంతికాసమాశ్లిష్టసహకార
మనోహరంబును, నాగవల్లీపరిష్వక్తపూగానోకహభాసురం
బును, మల్లీవల్లీవేల్లితకురంటకమహీరుహసమూహంబును, మాధవీ
లతాఽసక్తమంజుళవంజుళరంజితంబును గణికాగణాగణితసంసక్త
కాలస్కంధబృందావృతంబును, మీనకేతుగాఢాగాధబోధ
సాధితయోగభోగైధమానమృగవిహగయుగళాకులంబును,
కరేణుముఖగండూషపిపాసానుసరత్కరివరవరణవరణీయంబును
కోకభుక్తముక్తబిసాంకూరశేషలాలసచక్రవాకచక్రచంక్రమ
క్రమంబును పణాశృంగాగ్రశృంగారగ్రసిష్ణుకంఠాయమానాకృష్ణైణీ
సనీరిమీలితలోలలోచనాంచలాంచితంబును, నైకపుష్ప
నిష్పతద్రసాసక్తమధులిణ్ణినదవధికనిధువనసముత్సుకోత్క
రంబును, సకృన్మృణాళనాళలాలసలాలసంసక్తకలహంస
ద్వంద్వసంసక్తక్రేంకారశ్రావ్యంబును నైనతదీయాశ్రమంబునన్
బ్రవేశించి, యాస్వర్వేశ్యావతంసంబైనయూర్వశి, యా
దానవనాయకుం జేరి ॥ 78

ఆ॥ ధ్యానయుక్తు, మౌని, జానుమండలు, జితేం
ద్రియుని, శాంతు, దాంతు దృఢమనస్కు
బ్రహ్మనిష్ఠుఁజూచి, పరమాద్భుతాక్రాంత
యయ్యెఁగాంత; యట్టులైన, గాని ॥ 79

ఆ॥ విభ్రమంబులాడె, వివిధముల్ ప్రకటించి
యును, బ్రలోభములుబహుప్రకార
ములుగఁ, గొలిపి, దైత్యమోహమూఢునిఁ జేయ
నెంచె; నౌర; తెగువ! మించుబోణి ॥ 80

ఉ॥ ఆమనిదోఁచులేఁజివురులల్లన నల్లి, సపుష్పకోరకో
ద్దామముగాఁగ, నూర్వశియు, దానవపన్నయకుమీఁదవైచుచున్
దామముమున్ను, ఫాలఘటితస్ఫుటితాంజలియై, ప్రణామమొం
తే ముదిమొప్పఁ జేసి, రమణీమణి పీవసవిచె మెల్లగన్ ॥ 81

వ॥ మఱియును, సురసరసిజనయనప్రత్యగ్రజాగ్రన్మాఘ్యపుష్పా
ఘ్యంబును, మందారామందసౌందర్యధుర్యప్రసూనాంచితంబును
జాతపల్లవసంపత్సంలగ్నంబును, మరందబిందుసందోహాభి
వర్షియుసౌగంధికజకీర్ణంబును, భృంగీభృంగసంగీతకీతిసంసర్గియు
నైనమాల్యంబునుగురిచ్చి, యచ్చెలువచెలువమమర, నమర
విరోధిశిరోధింగీలించితద్భుజాంతరప్రాలంబంబుగా వించి, యంతట
మానక ॥ 82

ఆ॥ వీణ, సప్తతంత్రి, మాణిక్యకోలంబ
కాఢ్య, రత్నరంజితాతిశోభఁ
దాల్చి, శ్రుతిలమాన్వితంబుగా, లలితంబు
గాఁగమీటి, పాడి, కాంత, యంత ॥ 83

గీ॥ లలితలలితంబుగా, సురల నర్త
నంబొనర్చెలయానుకూలంబుగాఁగ
నాట, పాటయురెంగనింపైనసాధ
నములుగాఁగ, రతీశుఁడంతర మెఱింగి ॥ 84

ఆ॥ దైత్యవరాశిమీఁదదర్పంబెఱర్పఁగం
దర్పుఁజేచి, సైచెఁదలిరుములుకు
లేశములేక, కుడివము-నెపమగా సింగాణి
మార్చిమార్చి, పెద్దపార్చి పేర్చి ॥ 85

ఆ॥ మాధవోద్ధృతంబు, మన్మథారంభజృం
భితమునిట్లుదన్ను వీసమైన
గాసిపెట్టలేమిఁ, గ్రివ్వాడుఁదేమియుఁ
జేనమొందఁడయ్యెబలియుఁడతఁడు ॥ 86

ఆ॥ కనులయెదుటమచ్చెకంటిగాన్పించిన
నైన, మాటలాడఁడయ్యె, నామెఁ
జూడలేడ; యేమిచోద్యంబొ! బ్రహ్మలోక
గోచరంబు, మనసుగుఱివదఁడు ః ॥ 87

ఆ॥ అట్టినిశ్చలాంతరంగు దైత్యుని, యోగ
భాగుఁజూచి, యమ వనిత "యితఁడు
మహితమహిముఁ"డనుచు, మదిఁదలంచి, తడంతి
కంబువీడియుండెఁగాంతయంత ॥ 88

వ॥ నిరాశానిరుత్సాహంబులునిండారిడెందంబునంగ్రిందుకొన,మంద
మందగమనంబుననయ్యిందువదనయొక్కకందువంజేరి, సుదూ
రంబువిచారించియుఁబాకశాసనుశాసనంబునిర్వహించుటకే
యోజయుంగానలేక,యెట్టకేలకుధైర్యంబవలంబించి,"కానున్నది
కాకమానదు గాకేమి'యేనెట్లైనను,స్వామికార్యంబుఁదీర్చెదన్
గాక ! రక్షోఽధ్యక్షునకు మోహంబును త్పాదించుటకొంతె
యథాశక్తియత్నించెదన్ గాక!"యని, నిశ్చయించి, తత్సమీ
పంబుఁజేరి ॥ 89

ఆ॥ అంత, పూర్వరంగమారమణీమణి
వీణెఁబూని, శ్రావ్యగానమాచ
రించెఁగాని, యసురదృఢచిత్తుఁడై, ధీర
ధీయుతుండునై, ధృతింజెలంగి ॥ 90

ఆ॥ చూడఁడయ్యె; వేల్పుఁజేడియతోమాట
లాడఁడయ్యె; మానఁడయ్యెధ్యాన
యోగమతఁడు; స్థాణువోయనంగ, సునిశ్చ
లత్వమూని, గాలుబన్ బిగించి ॥ 91

ఆ॥ నిర్భరాంతరుండు, దుర్భరదర్శనుం
డయి, స్థిరాత్మయోగమందియున్న
జానుమండలాఖ్యు, మానినీమణి"యసా
ధ్యుం"డటంచు, నెంచి; యూర్వశియును ॥ 92

ఆ॥ అతనితపముఁజెఱుపనలవిగాక, యశక్త
యై, యమర్త్యలోకమరిగి, మిగుల
లజ్జఁజేర్మిఁజేసి, యజ్జలజాక్షి యె
గమ్ముఁ గాంచియుండెఁగిమ్మనకయ ॥ 93

ఆ॥ ఉవిశమాటమాటక్షుత్సాహశూన్యయై
దీనహీనరూపు, దివసశశిక
లోపమానయై, ముహుర్ముహురుచ్ఛ్వాస
ములునిగుడ్చు; స్వాంగవిభసనములు ॥ 94

ఆ॥ రోయుఁ; "దిగ్విభుఁడై నాయకు, దేవనా
యకుఁడు జూతునెట్టు? లతనికేమి
సెప్పుదాన? నిప్పుడొప్పరికించుటె
ట్లనుచు, నెంచుకొనుచు, వనితమదిని ॥ 95

ఆ॥ "ఎందుఁబోవుదాన? నెట్లాత్మగోపనం
బాచరించుదాన? నసురయోగి
చిత్తవృత్తిమార్పఁజేవసాలదనాకు
శూన్యమైనది; శక్తిసున్నయయ్యె ॥ 96

ఆ॥ దగ్ధదేహమేల? స్నిగ్ధరూపంబేల?
యందమేల? నాదుచందమేల?
దైత్యునోర్కఁ నిష్ఠఁనప్పింపలేనైతిఁ;
జెప్పుకొన్న, సిగ్గుచేటుగాదె! ॥ 97

ఆ॥ ఐనఁ, జింతయేల? కానున్నదేదియో
కాక, మానునే కొ—! కాలమొకటి
దైవమొకటి, వాయుదేవువేగంబొక
టియునడ్డుకొనుపటిష్ఠుఁడెవఁడు?" ॥ 98

ఆ॥ అని, తలంచి, దేవతాంగనధైర్యంబుఁ
బూని, స్వర్గనాథుఁ బ్రమొక్కి, యూర్వ
శీశుభాఖ్యశిధిలశిథిలంబు, వచనబం
ధంబుదోఁపఁ, బల్కెఁ దాజడియుచు ॥ 99

ఆ॥ "ఏమిసెప్పుదాన? నెకిమీఁడ! నీయను
గ్రహముఁబడసి, యరిగి, కార్యసిద్ధి
మాట కేమిగాని-మరల, నీసాన్నిధ్య
మెట్లుబెట్టులో, రహింబడసితి ॥ 100

తే॥ కడలినడుమమిగులఁగదలాడికదలాడి
యెదురుగాఁజలించి, యెట్ట కేల
కొడ్డుఁజేరుకొన్నయోడనై తిని; దేవ !"
యనఁగ, సంశయించి, యనియెవజ్రి ॥ 101

తే॥ "ఏమి, కామినీమణీ! యెటుల్ వర్తించి
తీవు? రిపునితపమునెటులఁజెఱచి
తీవు? సఫలమయ్యెనే? నీదుప్రస్థాన
మమరవరుల,రూఢియడఁపఁబడెనె ? ॥ 102

తే॥ రాక్షసోదయాంకురంబుసమూలని
ర్మూలనంబుఁబొందెనే ? లతాంగి !
చెప్పుచెప్పు వేగ; నీయుపరివృత్తిఁ, ద్వ
జ్జయమువినఁగమానసంబుపఱచు" ॥ 103

సీ॥ అనఁగ, నమరవనితయతికంపితనిజాంగ
యష్టియై, నతాననాబ్జయగుచుఁ
గాలిబొటనవ్రేలనేలవ్రాయుచు, నూర్వ
శియునుబలికెనిటుల, భయముగదుర ॥ 104

ఆ॥ “దేవ! దేవ!దేవదేశ! దేవేంద్ర! యేమి
చెప్పుదాన? సిగ్గుచేటు చెప్ప,
నసవి గోనంగాచినట్టి కన్నెలయయ్యె
నావిలాసములకు నాకుపట్లు ॥ 105

ఆ॥ ధీరధీరు లేమొనర్చి దారాక్షసేశ్వరుం
డుండె నిష్ఠనిశ్చలుండు మౌని
స్థాన మోయనగ, దాపమున్నదటండు దు
ర్దర్శనము నాథ! రజ్జుగాదు ॥ 106

ఆ॥ అతనిగదుపజాలదయ్యె నావిష్ణుమా
యయనుసురవరేణ్య! యేమిడుదాన
నేమిసేయుదాన? నేజేసినప్రతిజ్ఞ
వ్యర్థమయ్యెగా; యనర్థమొదవె ॥ 107

ఆ॥ వలదటంచు మొదటదేవ! భవితవ్యమునువా
రింపగలత్తపస్సమృద్ధినోంప
జాలలేనునేను; సత్యంబు-సత్యంబు
స్వర్గనాథ! దేవవర్గనాథ ! ! ” 108

ఆ॥ అనుచు, పలవతలుక, విని, మహేంద్రుడుపల్కె
“నీదుదోసమేమిలేదు;గాన
నిచ్చవచ్చినట్లు లేగుము; తన్వి! కం
దింపరాదుకీననిన్నుసుం” ॥ 109

ఆ॥ అని, పురందరుండు వనితవీడ్కొల్పి, దా
నొంటియట్లయేమిదోపకుండె
“జానుమంతలాభ్యుసాధించుటెట్లు ? స్వ
ర్గంబుదూరపానో, గాక“ యనుచు ॥ 110

కం॥ సురపతిజత్రానుజ్ఞను
శిరసావహియించి, యూర్వశియుఁ, బరిషత్సు
స్థిరులఁబ్రణమిల్లి, నతముఖ
సరసిజయయి, సరసగతిని జనె గృహమునకున్ ॥ 111

వ॥ అని తెలిపిన, వినియవ్వలివృత్తాంతం బెట్లని, యప్పినాకపాణి
యవ్వాణీజ నినడుగుటయును ॥ 112

కం॥ సిరియురమునఁగలక అతిఘోర
కలుషములికీగాఁగఁ, బ్రోల్లగాల్చిన యాగం
పురగంపఁచుఁవీవెకదా !
వరసాపురకపిలమల్లనామమహేశా ! ॥ 113

ఇది, ఆంధ్రీకృతముక్తీశ్వరోపాఖ్యానంబునం
దూర్వశీవిలాసంబను ద్వితీయాధ్యాయము.



శ్రీ రస్తు

# ఆంధ్రీకృతముక్తీశ్వరోపాఖ్యానము

## తృతీయాధ్యాయము



ఆ॥ సిరిసుగంధు, నలువ, సురపతి, కరితుభుజుల్
కొలువఁగొలువుదీరి చెలువమమరు
గరిమ నీకెతగును; కపిలమల్లేశ! గౌ
రీశ! నరసపురవరేశ! యీశ!! ॥ 1

ఆ॥ అవధరింపు; దేవ! యవ్వలివృత్తాంత
ము మురహరునియడిగె నబ్జగర్భ
"జానుమండలాఖ్యుఁడౌనిననిష్ఠయ
ద్భుతము; వినము-కనము; భువనములను ॥ 2

ఆ॥ వినఁగవినఁగ, మహితవృత్తాంతమిదికుతూ
హలముమదికిఁజాలఁగలుగఁజేయు
చుండెఁ, గాన, విడువకుండఁగసర్వంబు
నానతీయుమయ్య! యబ్జగర్భ! ॥ 3

ఆ॥ పిదప, నేమిసేసెఁబిశితాశనుఁడు, జాను
మండలుండు? దపమఖండనిష్ఠ
నెన్ని యేండ్లొనర్చె? నేమితద్వృత్తాంత?
మలఘుఫలమదేమియందెనసుర? ॥ 4

ఆ॥ తపముపండియసురతపయక సేసిన
పనియదేమి? యతఁడువరముఁబడసె
నేమి? నీవనుగ్రహించితే, తండ్రి! త
త్సర్వమెఱుఁగఁజెప్పుజలజగర్భ" ॥ 5

పాతంబు నొందిరి. పారావారంబు లెల్ల నవ్వారిగాఁ గశోషిల్లె. దిగ్గజవ్రజంబులు జగ్గడిల్లె. సకలకులాచలంబులు పరిచలంబు లయ్యె. సిద్ధసాధ్యచారణగంధర్వవిద్యాధరాదులు విషాదంబు నొందిరి. లోకంబులును, లోకాధినాథులును నాధివ్యాధిగాధితు లైరి. చతుర్దశభువనంబులును ముహూర్తకాలాంతరంబునఁ గ్రాఁగించె నంతట, నయ్యండజులు వందురుచున్, దుడుకు నగడొందిన డెందంబులతో నయ్యరవిందసంభవుని శరణంబు నొంది, యిట్లని యభ్యర్థింపఁ దొడంగిరి. 11

ఆ॥ దేవ, లోకనాథ! ధీర, నాభిసుమం
బులని వెరసి, నళినని॥య! వేగఁ
దత్తపోఽగ్ని లోకదాహంబుఁగ విడు
కుండ, మున్నె వరములొసఁగుమయ్య! ॥ 12

ఆ॥ ఏముదత్తపోఽగ్ని నెట్లు సైరింతుము
బ్జాసనా! చతుర్ముఖా! మహాత్మ!
శరణమీవె మాకుఁ బరమనిష్ఠాగరి
ష్ఠుని, సురారిఁ జూచి మనసుగలిగి ॥ 13

ఆ॥ వారిదియసుర యడుగు వరము, "నష్టగుణో
తపువుగాఁగ" నొసఁగఁడలఁపుమనఘ!
తేఁపవేని, మాదు దైన్యంబు, హైన్యంబు
మానుటెట్లు? సర్వమాన్య! చెప్పుము!! ॥ 14

ఆ॥ వీఁకవాఁడు సర్వలోకాధిపత్యమ్ముఁ
గోరెనేని, యిమ్ము; ఘోరమైన
తత్తపోఽగ్ని పైఁబడందరమాన్చి, మాకుఁ లో
కేశ! వాగధీశ! యిష్టపుణ్య!! ॥ 15

దితిసుతుండు, నిత్యదృఢుఁడై, వరములఁ
గలిమిఁ భువనములకుఁ గాఁడె సర్ప
లగ్గుఁగాదె, దేవ! కిఁగాఁడే దత్తపో
వహ్ని సైపఁదరమె? వనజనిలయ ! ! ॥ 16

ధాత! లోకజాతదారిద్ర్యహాహేతువీ
ఘోరవహ్ని శాంతిఁగూరె నేని
సత్యపూనుఁజూవె, సత్సమారంభంబు
నీదినిశ్చయంబుఁగాదె, దేవ ! ॥ 17

దైత్యమునికిఁగాంక్షితములైనవరముల
నిచ్చి, పోవుమయ్య! యెల్లలోక
ముఁ నటంచు,"యజ్ఞభుక్కోటివల్కఁ, మా
టాడకుండె; నంత, నజ్జుసూతి ॥ 18

సురలఁజూచి. లేఁగరుణమై; "సురలార !
యభయమిచ్చుచుంటి; శుభముగలుగు
వరములసురకొసఁగువాఁడ, నంతట, శాంతుఁ
డౌనుగాక, యసుర; యమరులార ! ॥ 19

కాకమాన దెందుఁగానున్నది యమర్త్య
లార! పోవుదముసురారికడకు "
ననుచు, నలువయరిగెఁగన కాద్రిశృంగసం
స్థితు, సురారిఁజూడఁగుతుకమునను ॥ 20

ఏకపా[illegible] చ్ఛలాకారసంస్థితు,
స్థాణు[illegible] లుఁజూచి, [illegible] ంత
లాము[illegible] రేఁబ్రిహ[illegible] యత్యంతసంతుష్టి
గలి[illegible] ముపే[illegible] ॥ 21

ఆ॥ మెచ్చి, వరములీయ వచ్చితి నడుగుము;
కోర్కెలేమి? దైత్యకులవతంస!
యనుచు, సన్నిధానమందు, పితామహ
పతని బ్రహ్మరంధ్రము పైనూసి ॥ 22

ఆ॥ శాంతిఁ గూర్చె వానికంతట, జానుమం
డలుఁడు గనులు మొగిచి, నలువ సమ్మ
దాశ్రుపూర మొప్ప, నసురేశుఁడు సరో
రుహజు. హంసవాహు, ద్రుహిణుఁ గాంచె ॥ 23

ఆ॥ పద్మపీఠు, బ్రహ్మ, స్ఫాటికశైలాగ్ర
ఫుల్లకింశుకంబుఁ బోనివానిఁ
బద్మరాగతుల్యభాభాసమాను, వే
దోపగీయమాను, యోగివంద్యు ॥ 24

వ॥ కనుంగొని, కనుంగొనల బాష్పపూరంబులురల, నసురవరుండు
ప్రసన్నాత్ముండై, యానందతుందిలహృదయుండై, భక్తిభావం
బునని ట్లని స్తుతియింపం దొడంగె ॥ 25

సీ॥ "భూతభావన! ధాత! భూతేశ! భూతాత్మ!
పరమేష్ఠి! లోకేశ! పద్మగర్భ!
లోకకర్తవు నీవ; లోకభర్తవు నీవ
లోకహర్తవు నీవ; లోకమీవ
విప్రవాగ్వ్యాపార వేదాక్షరవ్యక్త
నైజస్వరూప! నీరేజపీఠ!
వాణీమనోనాథ! వజ్రపాణ్యాదిగీ
ర్వాణమౌళిస్ఫురద్రత్నరాజి

కాంచనీ రాజితాంఘ్రి రేఖాంకితీన
లీనవిఫలదగ వైభవానుకూల
శైలనవసన్ముఖేందుకుగ్జాలలోల
మందహాసానుభావ! శుంభత్ప్రభావ! ॥

దేవా! త్వన్మహాత్మ్యాంశలేశంబు మూలాధారంబుగా, లోకపాలురెల్లరును గ్లేశంబులేశంబు లేకుందురు. భూరిదక్షిణాకంబులైన యజ్ఞంబులెన్నియేనియుం జేసి, ద్విజశ్రేష్ఠులు యజ్ఞేశ్వరుండవునైన నిన్నె గదా యజింపుచుందురు! నిన్నెవ్వరెవ్వరే యేరూపంబున నుపాసింపుచుందురో, నీవు నవ్వారినెల్ల నవ్వారిగా నట్లే యనుగ్రహింపుచుందువు గాదె! ఇంద్రుండవు నీవె; యుపేంద్రుండవు నీవె; రుద్రుండవు నీవె; ప్రజాపతివి నీవె; సర్వభూతాత్మకుండవు నీవె; ప్రభూ నిన్నే శరణంబుఁజొచ్చినాఁడ; పాలముంచినను, నీటముంచినను నీదేభారంబు, ఆమ్నాయవేత్తలు, సభ్యాత్మరతులునైన జనులు నిన్నె పరాత్పరునిగాను, బరమాత్మునిగాను జెప్పుచుందురు. సకల తపఃఫలంబయిన భవదీయదర్శనమహాభాగ్యంబు నొందఁగల్గితి నేను ధన్యుండ; మాన్యుండ. నాజననంబు సఫలంబయ్యె, నాజీవితంబు విత్రంబు యోగీశ్వరులన్వేషించి, కన్గొనలేని నీవయిట్లు నన్నన్వేషించుకొనుచువచ్చి, దర్శనంబిచ్చితివి. నాకంటె ధన్యతముం డీరేడు లోకంబులందెవ్వండును లేఁడు. నన్ననుగ్రహింపు" మని, వివిధ విధంబుల వేఁడుకొనుచున్న రాజసుమాటలుజూచి, వాణీవల్లభుండిట్లనియె ॥ 27

"నీతపంబుకలిమి నేనుసంతుష్టినొం
దితి; నిజమ్ము సుమ్మి! దితిసుతాగ్ర్య!
యిట్టిఘోరనిష్ఠ నెవ్వరేనాఁడొందఁ
బూనరయ్య! కాదుబూటకంబు ॥ 28

వ॥ పూర్వకాలంబున గొందఱబ్భక్షులు, కొందఱు వాయుభక్షులు, కొందఱు పర్ణభక్షులు, కొందఱు నీవారకభక్షులు, కొందఱు శాకభక్షులు, కొందఱు ధూమైకభక్షులు, కొందఱు మృద్భక్షులునై బహువిధంబులం దపం బాచరించినవారు లేకపోలేదు. నిర్భక్షుండవైన నీవలె బ్రహ్మనిష్ఠుండైన తపశ్శాలి యొక్కరుండైన నింతకు ముందులేఁడు. ఇంక ముందు పుట్టఁబోఁడు. మెఱమెచ్చులకీ చెక్కంబులాడుచుంటి ననుకొంటివో? వంట! ముమ్మాటికీ నీవంటి నిష్ఠాగరిష్ఠుండు నీయట్టి జగజ్జెట్టి "నభూతో నభవిష్యతి" యంట కొంటెమాటగాదు సూ, పోటుబంట! నేనీకుం బ్రసన్నుండనైతి. సన్నకసన్నగాక, మిన్నగా వరంబు వేఁడు మిచ్చెద. సర్వసౌభాగ్యకారణంబును శ్రేయస్కరంబునైనదాని నేనీ కవశ్యంబు వశ్యంబగునట్లనుగ్రహించెద;" నని, యనునయించుచుం, బల్కుచుండు నక్కంజాతసూతికిన్ దైత్యేయాధినేత యిట్లనియె ॥ 29

ఆ॥ సత్యసత్యమాన, దేవ! సాద్గుణ్యముగ నాదు, నిష్ఠకీవు వరగరిష్ఠఫలము
సంగదంచి తేని, జాంబూనదోదరా! కోరుచున్న నాఁడు భూరితేజ!

ఆ॥ ఇదియనుత్తమంబయిన వరంబని వేఁడు
చుంటి; దేవదేవ! యుజ్జ్వలప్ర
భావ! వీరశబ్దభాక్త్వంబు సర్వలో
కంబులందు నాకుఁ గల్గుఁగాక! ॥ 31

ఆ॥ దానఁ జేసి యేను దానవాధీశుండ
నై, మహేంద్రముఖ్యులౌ సుపర్వ
కోటి చేత నేటికో ళ్లేమి? "కో" యనఁ
గోటిదాస్యములనుగొనఁగవలయు ॥ 32

ఆ॥ స్థిరముగాఁగలక్ష్మిచిరముగానిల్చు దై
త్యాధిరూపరాజ్యమందుఁజంచ
లత్వదోషమింక, లక్ష్మికిలేకుండుఁ
గాత! ధాత! యంబుజాతజాత ! ॥ 33

ఆ॥ మఱియు, నరమునిమ్మ మరణంబులేకుండుఁ
నట్లుగాఁగనాకునమరవరుల
వలనఁగాని, ప్రాణివర్గంబువల్లఁ,ద్వ
త్సృష్టిలోనవేనిచేతఁగాని॥ 34

వ॥ దేవా! నీవునిజంబుగానాతపఃప్రకారంబునకున్ మెచ్చుకొంటివేని, నాకవధ్యత్వంబువరంబుగానను గ్రహింపు " మని, నిశ్చయించం బుగా, నిష్కర్షించిపల్కిన యాజానుమంజలునకుం బ్రసన్నుఁడై యయ్యరవిందసంభవుండిట్లనియె॥ 35

ఆ॥ "అటులెయగుసుగాక! యమరగంధర్వయ
క్షాదివీరవరులెకాదు-నాదు
సృష్టిలోనిప్రాణియేదైనఁగాని,నిన్
జంపలేదు; లేదుసందియంబు॥ 36

ఆ॥ బలిమికలిమిసురలగెలుతువు; సకలలో
కములునీకులోఁగి, కైవసమగుఁ;
బొమ్మువేగ; చిరతపోలబ్ధసత్ఫల
మ్మందుకొ" మ్మటంచు, నావిరించి॥ 37

ఆ॥ సురలతోడ, మానివరులతోనంత, నం
తర్హితుండుగాఁగ, దైత్యనాథుఁ
డెంతయేని గర్వమేచ, నీచాతినీ
చంబు, వానగోచరంబుగాఁగ॥ 38

ఆ॥ క్షైత్రయాత్రనంత, సాగించి గాత్రించు
కించిదూనతయు సహించుచుతృప్తి
లేక, లేఖపాళిఁ జీకాకుపెట్టి, స్వ
ర్గంబుముట్టడించెగండుమీఱి॥ 39

ఆ॥ సురల, మునుల, ధర్మపరులగుపాఱుల
సేఁగిలోఁగఁజేసి, చేతుకామఁ
దానురారిదీనమానవస్థకు వారిఁ
బెచ్చుద్రుహిణవరసదృప్తుఁడౌచు ॥ 40

వ॥ అని, తెలిపిన, విని, యవ్వలివృంతబెట్టనియుప్పింగా హా నివాణి
జానినసుగుటయును॥ 41

॥ శిరసుజంద్రరేఖ, వికటంబులగుమూఁడు
కన్నులందునొకటఁగానుపింప
కత్తికత్తి, మేనగజాతయొప్పశ్రీ
కపిలమల్ల! రిపునికాయభిల్ల!!॥ 42

ఇది, ఆంధ్రీకృతము క్షీరేశ్వరోపాఖ్యానంబునందు జానుమంతలవర
ప్రాప్తియను తృతీయాధ్యాయము



శ్రీ స్తు

# ఆంధ్రీకృతముక్తీశ్వరోపాఖ్యానము

## చతుర్థాధ్యాయము

కం॥ సిరియురమునఁగలకఠినార
కలికములికిఁగాఁగఁ బ్రోల్లుగాల్చిన యాగం
ఉఁగంపఁజేవీవెకదా!
సరసాపురకపిలమల్లనామమహేశా ! ॥ 1

ఆ॥ అవధరింపు; దేవ! యవ్వలివృత్తాంత
మమరమునియునడిగెనబ్జగర్భు;
" జానుమంటలాభిధానునట్లద్భుత
విక్రమక్రమంబు వెక్కసముగ ॥ 2

తే॥ నీయనుగ్రహంబ జేయుటన్ జేయ, దై
త్యాధినాథుఁ,దండ్రి! యసురులెల్ల
నిల్లనీదుకరుణ నేచి, లోకములేర్చు
నేర్పుఁజూపి; రెంతనీచులార! ॥ 3

తే॥ హంసవాహ! నీదు "నంపదంపలు" లేక,
వారలెట్లుమత్తులై, రుపాక
పాయితాక్షిణోణులై, యీజగత్త్రయ
మ్మనుజయింపఁగలరు? వనజనిలయ! ॥ 4

॥ ఆనిలింపవైరి, జానుమంటలుఁడెంత
కాలమేర్చులోకపాళి? నేమొ
నర్చిరమరులసురుఁగార్చిచ్చుఁబోనివా
నినిసహించుకొనిరో-కొనరో, చెప్పుము! 5

ఆ॥ అహాహా! "ముక్తహాని"యంటివి కాదె,ము
మ్మొనట; దేవ! "యదియపూర్వగాథ"
యంటి"వదియు, బహురహస్యాన్వితం"బంటి, "కౌ
తూహలంబుఁగూర్చు నూహసేయ"॥ 6

ఆ॥ అంటి వనఘచరిత! యాముక్తి నివరి
త్రింబు విన్న, శ్రోత్రతర్పణంబొ
నర్పు"మంచు, వేడునారదుఁ జూచి, య
బ్జాసనుండు మందహాసమొప్ప॥ 7

ఆ॥ "వినుము; వత్స! దైత్యవీరుఁడా జానుమం
డలుఁడు నాడు వరము కలిమి మిగుల
గర్వమొంది, లోకకంటకుండై, జగ
త్త్రయముఁ గాల్చునట్టిదంటయయ్యె॥ 8

ఆ॥ సాధుపుంగవులను బాధించు; యోగుల
కెగ్గొనర్చు; విప్రఋషుల, యాయ
జూకవరుల, దుష్టుఁడై, కస్తిఁగుడుపుఁ; గి
గ్గాడియసుర తనదుదాడులందు॥ 9

ఆ॥ పలచయసుర ప్రోలు "సురకంటకం" బధి
ష్ఠించి, దుష్టబుద్ధి, క్రించు, దైత్య
మండలాధ్యుఁడై, యఖండగర్వంబున
జానుమండలాభిధానుఁడేచె॥ 10

ఆ॥ పెక్కురించువాఁడు పోత్రిత్తములఁ, సాత్త్వి
కులనుజూచి, న్యాయకోవిదులయి
రాజ్యమేలు మేలిరాజర్షివరులతోఁ
బోరిఁగోరు, నౌర! యాంటికసుర ॥ 11

సీ॥ అంగవంగకళింగులాంధ్రులు, ద్రావిడుల్
బర్బరుల్, ఘూర్జరాహ్వయులు, శూర
సేనపాంచాలకాశ్మీరమాగధలాట
మాళవనేపాళగౌళయవన
గోనర్దకాదికక్షోణీతలాధీశు
లెల్లరుదైత్యలోకేశుప్రోల
నొదలల్ వంచి, మాళ్యంచితసక్రస్త
మకరందరేణుసంబాధగౌర

ఆ॥ పాదుఁ జేయుచుండ్రి పాదపీఠముఁ జేర్చి
యెంత లేసిదొలు, హీత్రితు[ణు]లాచు
వానిఁ బ్రీతుఁ జేసి, వానియాదరమొంద
కుండువాఁడునొక్కఁడుండఁబోఁడు ॥ 12

ఆ॥ మఱియు, రాజులెల్ల మఱియూదకై, వేఁట
లాడి, జానుమండలాసురునకు
గహనసీమఁజంపి, బహువిధమృగముల
ప్పనముగాఁగనిత్తురనఘమతులు ॥ 13

ఆ॥ వాఁడునాప్తబంధువర్గంబులంగూడి
వానినెల్ల మెక్కి బోనమందు
నుక్కివుండు, దైత్యుఁడుజ్జ్వలరూపయౌ
వతముఁగవయఁదివురుఁబ్రతిదినంబు ॥ 14

ఆ॥ ఐనఁ, దృష్టిలేక, దానవుండొకమాఱు
వ్యోమచరయానచరుల, నుజ్జ్వలాంగు
లైనసురలఁజూచి; యట్లైవిజృంభించి
రోషహూంకృతస్ఫూర్తిభాషణుఁడయి ॥ 15

ఆ॥ ఎగసిబిట్టు, తీవ్రముగవ్యోమయానంబు
పీల్చి, యమరులకును పీడసేసి
తనివిసనక, యంత, దనుజుండుకనఁబడ్డ
వారినెల్లఁజదుపుఁగ్రూరుఁడౌర ! ॥ 16

ఆ॥ అరరే! యసురయుఁచుయక్షగుహ్యకసిద్ధ
సాధ్యగణము, వాఁడసాధ్యుఁడై, మ
హీధ్రసానువులనేకవిధక్రీడ
లందుఁజాలఁదేలియాడువారి ॥ 17

ఆ॥ వాఁడ విన్నఁజాలునాడుదియన్నాటఁ
గన్నఁజాలుస్త్రీలఁ; గాముకత్వ
పాశవములదైత్యపాశుండుబల్మిఁదాఁ
బట్టి; రతులఁదేలి, వదలిపెట్టు ॥ 18

ఆ॥ అసురకలఁచినైచి, వ్యాముగ్ధమానసుం
డౌచు, మధ్యలోకమంతస్వర్గ
వర్గమెల్లవడఁక; దోర్గర్వమొప్ప, ని
ష్ఠురవిచేష్టితములసారిదిఁబూని ॥ 19

ఆ॥ కొండలూడఁదీసి, చండప్రతాపుఁడు
ద్దండుఁడై, ప్రవృద్ధదర్పమొప్ప
గ్రామసీమలందుఁగ్రౌర్యంబుమైఁబాఱి
వైచు, వాఁడుసాఁగిచుఁడౌర ! ॥ 20

ఆ॥ వాఁడొకప్డుచంద్రుఁబట్టిక్రీడార్థకం
దుకముగాఁగవైచుఁబ్రకటగర్వి
సూర్యుబిట్టునిల్పుఁజోద్యంబుగాఁ; జాను
మండలుండు, దాష్ట్యమండనుండు ॥ 21

ఆ॥ వానిబారికోర్వ వశమేది, యక్షగం
ధర్వసిద్ధసాధ్యనాగకిన్న
రాదికాదితేయులధ్యాత్మవేత్తలౌ
మౌనివర్యులింద్రుఁగానఁబోయి ॥ 22

ఆ॥ "శరణమీవెమాకు; సురనాథ!" యని! వెచ్చ
నూర్చి, దైత్యుఁడార్చి పేర్చు దుష్ట
చేష్టితములనెల్లఁజెప్పిరి; బ్రహ్మప్ర
సాదమునను వాఁడు చండుఁడౌట ॥ 23

ఆ॥ వారిదైనదైన్యవాక్యంబువిని, యింద్రుఁ
డభయమొసఁగి, వారికనియెనిట్లు
"వినుఁడు; విబుధులార! మునులార! జానుమం
డలుఁడుబ్రహ్మవరముకలిమిఁజేసి ॥ 24

ఆ॥ సరకుఁగొనకమిమ్ము, సంక్షోభపెట్టు; నే
నెట్టులూరకొందు? నిదియెనాదు
శస్త్రధారవాఁడుశతధాసహస్రధా
భిన్నదేహుఁడౌను; వెఱపుడుగుఁడు ॥ 25

ఆ॥ క్షణములోనవానిగర్వంబుసర్వంబుఁ
దుడిచివైతు; వానిదుడుకడంతు"
ననుచుఁబలికి, ననుచునవితరసాధార
ణోరుపౌరుషమునకనుద్యమించి ॥ 26

ఆ॥ అనిమిషాధినాథుఁడైరావతారూఢుఁ
డై, యమర్త్యసైన్యమనుగమింప
నాయుధములుపెక్కులాయత్తపఱచి, జీ
మూతలాంఛనంబుఁబూనెధనువు ॥ 27

| ప్రధనవిజయసిద్ధుల, రథగజతురగాధి
రూఢులైనవారిఁ, గ్రూరయోధ
వరులఁగూడి, యింద్రుఁడరిజయోత్సుకత, దం
డెత్తిపోయె దైత్యునెదురుకొనఁగ ॥ 28

॥ అంత, దైత్యసైన్యమాదిత్యసైన్యము
నన్యోన్యవిజయకాంక్షఁ జన్యమంద
నేకశస్త్రముల, ననేకాస్త్రములఁ బ్రయో
గించుకొనికొంచకించుకైన ॥ 29

వ॥ వాసవవైశ్వానరవైవస్వతవాసతేయాచరవార్ధీశవాయువైశ్రవణ
వామదేవముఖులొక్కుమ్మడి నుఱవడించి, జానుమండలుని, వాని
తమ్ముండైనసుమండలుని, వారిపరివారంబులోనివారైనమహిషా
సురకాలనేమిఘటాసురులను డీకొని, వివిధంబులైనప్రధనసాధ
నంబులఁ బ్రయోగించి యెంతయేని బాధింపం దొడంగి-రంతవారును
“తక్కువతిన్నవారుకారు”గావున, వారికిఁదీసిపోవక, నానాశస్త్రా
స్త్రంబులను ముంచెత్తి, వ్యాఘ్రభల్లూకఖడ్గాదిమహోగ్రసత్త్వం
బులు వాహనంబులుగా, నారోహించివచ్చి, యాదిత్యసైన్యం
బుల దైన్యంబునొందించిరోదోఽంతరాళంబును భేదించుచాడ్పున
విన్నవారెల్లరుం జెవ్వడునట్లుగా, భీకరంబులైన సింహనాదంబులు
సేయుచు విజృంభించి-రంత, సర్వసత్త్వసాధ్వసాధ్వవస్థాసంధాయ
కంబైన యామహానాదంబు నాకర్ణించి, మేరుమందరవింధ్యాది
శైలకందరాంతరశయాళుసింహవ్యాఘ్రవరాహాదికక్రూర
సత్త్వంబులెల్లను దమక్రొవ్వుం జెప్పుడిఁగి యడంగఁ గఁగడంగరియం
బులకై పడి, పడి లేచి, యొడిసెలలు, బెడిదంపు టడిదంబులు బడిఁ
బడిఁ బడినపడు నభయవిహ్వలంబులై, యడుగులు తడఁబడ,
హతాత్మతయాళువులయిన బుడుతల బుడిబుడి చెయిదములనుఁ దనను
గనుఁగొనక, యిటునటుఁ దిరుగుడు పడుచు, నవకూడం బోడంగె
నంత ॥ 30

ఆ॥ సైన్యగాత్రభేదిశస్త్రాస్త్రపాతసం
జాతనూత్నరక్తశైవలినులు
కంకగృధ్రములకుఁ గదనరంగమునఁ బా
అంగఁ జొచ్చెఁ గట్లరాచికొంచు॥ 31

ఆ॥ ఇట్టియుద్ధమందహీనసత్త్వుఁడు, జాను
మంతుఁడసురుఁడు, చండకోప
ఘూర్ణితాత్ముఁడౌచు, క్షోభించి, గర్జించి,
గదను వ్రేసెనందు గ్రుడు వరిపఁగ॥ 32

ఆ॥ అంత, వానిశమ్ముఁ డాసుమంతుఁడు క్రో
కోపించి పెల్లగించి, భీషణమున
గాఢనేసె వహ్ని గాఢ, వేగమున వ
క్షంబు వగుల, వహ్ని కలఁతఁ జెంద॥ 33

ఆ॥ అంతమాత్ర వహ్ని యదలక, జ్వలదుగ్ర
బాణపాతములను బర్వతంబుఁ
జూర్ణితంబొనర్పఁ జూచి, సుమంతుఁడా
సురుఁడు ముసలమేసె సరగ వహ్ని॥ 34

ఆ॥ తత్ప్రహారమునఁ బతత్రిప్రభవుండౌచు,
నిట్టిమూర్ఛ నొందెఁ గృష్ణవర్త్మ
కాలనేమియంతఁ, గాలాంతకాకారుఁ
డై, కృతాంతు ముద్గరాయుధమున॥ 35

ఆ॥ వ్రేసి, మూర్ఛ నొందఁ జేసె; విభ్రాంతులై
రెల్లఁ దిగ్దశయోధులేచి, యంతఁ
గ్రవ్యదాష్ట్రరాశి, ఘంటాఽసురుండు మూ
ర్ఛితునొనర్చెఁ గిన్నరేశుఁ బోర॥ 36

ఆ|| తక్కు-దేవతలను, దక్కనై పేయులు
చిక్కుతలును, వారు "చెప్పుకొనకయుండు,
పుట్టుకొనకయుండు" బోయి, పోయినపోకనొండె
"దలలుతడవికొసరి"-కలంతగొసరి|| 37

ఆ|| నాకులెల్లఁగాంచి శోకులై, దూతల
పాటునొందఁగా, నిశాటులంత,
దృష్టచిత్తులై చూఁడ్రిదివంబధిష్ఠించి,
యిచ్చవచ్చినట్లు పెచ్చరిలిరి|| 38

సీ|| భూరిలావణ్యసంపూర్ణతారుణ్యరా
సులు, సురస్త్రీలు బందులనలరిరి;
పూతకీర్తి యొకిన్ ప్రీతిదాయకములౌ
పారిజాతంబులు పాన్పులయ్యె;
మందాకినీజలానందదంబులు స్వర్ణ
జలజముల్ దిగుడు బావ్రల నడంగె;
సురకంటకాఖ్యమహాపురవరంబద్వితీ
యంబైననాకలోకంబయయ్యె;

ఆ|| సుప్రభాతమయ్యెఁ బాపప్రతాపుఁడౌ
జానుమండలాభిధాను ధాటి
నామరూపహీనమై మనుష్యాదిలో
కమునకహహ! యదియె కాలమహిమ|| 39

వ|| మఱియు, వినుము; కుమార! కాలవైకృతంబుననైన వైపరీత్యంబున
కేమనంగలదు? కులిశపాణికుశలంబు పెక్కించి, చారురూపంబులై,
వసివాడక, సువాసనావాసితంబులైన కల్పవృక్షపుష్పం
బుల సంగ్రహించి, ప్రియశిష్యపూర్వకంబుగా సంగ్రథించి పెంచి

నక్తంచరేశ్వరుడనకు పాయనంబుగా నర్పించుచుండు, వీతిహోత్రుం
డును, పౌరోభాగ్యంబున జేసియును గ్రిహామహాభాగ్యం బెక్కడ
దప్పునోయని, భీతభీతుండై, మహారసోపేతంబులై, తదుల్బణా
న్యూనత్వంబులు లేక, సమత్వసంశోభితంబులైన భక్ష్యభోజ్య
లేహ్యచోష్యపానీయంబులు వండిదను గ్రహోపనీయమానంబులుగా
యథాకాలంబున నమర్చుచున్; బాహోగవంబు వహించుచుండుఁ
జండశాసనుండైన సూర్యానుమండలు గాఙ్ఞలేక, దండధరుండు
వానియేలు నేలనే పాళ్లైనన్ బాణిన్ స్పృశింపభీతిఁ జెందు
చుండు; సూర్యుండు ధ్యానశక్తి కాలంభోజమహావ్యాకోచనాథన
మాత్రంబ కాని తదధికతరంబగు కిరణవిసరప్రసరణావ్యాపారంబున
భీరుత్వంబుచేత నేమాని యుండు. మిన్నుకుమారిపాదంబు లెప్పుడను
మలయగిరికటకనికటంబునంటియుండి. తద్దక్షిణోద్ధ్యక్తభీతినైహుక
తత్పరిష్టసూచనాస్థాత్వశ్చర్యచర్యారూపప్రవృత్తి సృష్ట్యశ్రుతా
దృష్టచందనమంజరీజరీజృంభత్పరాగపూరసౌరభోద్గారంబులై,
మందమందయానంబులం బదీపావరోధవీథీవితానంబులన్ బుల్కు
పుల్కునవిహారంబుల హోరాత్రంబు లేక రీతిని జేయుచు, యామినో
ద్యోగంబు నిర్వర్తించుచుండుఁ; జందురుండును దచ్చందరిశాలలన్
జంద్రికాస్ఫుటికలతోడం గూడ దదీయచంద్రిక్యల కేళీ
విశేషంబులం గ్రీడాకందుకంబగుచుండు; నిల్లుగానసేవ్యమానుం
డగుచున్నను, ఆజానాపావనదుష్టాత్ముండైన యాజాను
మండలుండు లోకంబులన్ గ్లేశమొందించుచునే యుండుఁ గాని;
శాంతస్వాంతుండు గాక యుండు. లోకంబునన్ బాముననున్ బాలు
వోయుట కేవలంబు, విషవృద్ధి కేగదా, దోహదంబగుచుండుఁ;
గావున, వాఁడును॥ 40

ఆ|| అలసముఁన్నతాసనాసీనుఁడై, డాయ
వచ్చు మునుల, ద్విజుల, బ్రాహ్మవేత్త
లను, శుచివ్రతాఢ్యులను జూచి, లేవండు;
క్రించుదనము మానఁడించుకైన || 41

ఆ|| వారినెల్లఁగ నిపను నియోగించుఁ
"గూరగాయలమ్ము వారివోలె;"
నెంతగర్వి! వానియింటికివచ్చిన
గురుకుమారకులను గూడఁ గేయు || 42

ఆ|| గర్వమునను భృత్యునిన్ శేషంబుగాఁ
జూచునెల్లవారి, నీచు, మూర్ఖు
ధూర్తు, క్రించు, మీఁని గుర్తింపకుండె, వాఁ
డేమిగాఁగలోననెంచినాఁడో! || 43

ఆ|| పూర్వవైరమెంచి, సర్వగీర్వాణవ
ర్గంబుహింససేయుఁగ అకుటసుర;
యగ్నిముఖమునుండియూహావిర్భాగముల్
సురలకందకుండ "సాడ్డుపెట్టు" 44

ఆ|| పలుచ, పొలసుఁదిండిసురకన్యకలఁ బట్టి
స్వార్థముంచి, శీరికంతలేక,
యూమికులనునిల్ప్రగామీాబ్ధిదా
రిద్ర్యమెంతయేనిరెక్కుఁజేయు|| 45

ఆ|| దానవాధముండుదానుగత్యాకృత్య
మేమెఱుంగకయు, యహీనగర్వ
మునను యక్షతురగముఖుల, గంధర్వుల,
వృక్షసేచకులుగ, నేర్పరించె|| 46

వ॥ మఱియు, వాఁడు శంకరకింకరులను, శ్రీవిభుసేవకులను, సారపారానుష్ఠాతలగు సుజనులం బట్టియీడ్చి, చేతులారఁ బందీబద్ధులం జేయుచుండు; బాహ్లిణాయామపరాయణులకు, రేచకపూరక కుంభప్రియత్నపరులను, సత్త్వసంపన్నులన్ జపేటాదులన్ దండించుచున్, బీడించుచుండు. నిజతపోబలంబుచేతను, వరగర్వంబుచేతను, సకలసురనికరంబునకు నిష్కారణకారణంబగు కారాగారంబున నేయనుభరంబునకుఁ దెచ్చుచుఁ, దనివిననక ॥ 47

ఆ॥ అసురయున్నతాసనాసీనుఁడై, సుమంత్రులనితోడఁ, బరిజనంబుతోడఁ గొలువుదీరియుండి, కోరి ప్రశ్నించుచుండుఁ జగములెన్ని, యన్నినయములు మీఱ ॥ 48

వ॥ "ఓరీ! యీ వాఁడే విప్రబృందంబున్ గారాగారంబునం బెట్టి, కారాకూరంబుగా వించితిరి? స్త్రీలనెందఱ బందీకృతలం జేసినారు రా? యే యజ్ఞంబులు విఘ్నితంబులుగా సర్పంబడినవి? విధివద్యజనపరాయణులనెందఱన్ దాఁడించితిరి? ఎచ్చటెచ్చటన్ బుణ్యాశ్రమంబులు పుణ్యజనుల చేర రక్తధారాసంసిక్తంబులుగా వింపంబడియె?" నని, యడిగి, యావద్వృత్తాంతంబునాకర్ణించి, వాఁడు మేను వెంచి యావులించి, హర్షించుచుండు. లోకంబునసంక్షోభంబెంతగల్గింపఁబడిన, వాఁడంత సంతోషించుచు; నొక్కొక్కప్పుడు వాఁడు లేని నేరములెన్నని గల్పించి, సురమునినికరంబులం గనికరంబు లేక, నికరంబుగ దండించుచుండు; నిట్టిదుష్టచేష్టితంబులచే దివౌకసులు దిగ్గ్న భగ్నమానసులై, క్లేశితక్షోభితులైరి ॥ 49

ఆ॥ అమరవరులు నొల్లి యమృతపాయులైన నసురవిభువలన నసురుసురయి జంకుగొంకునొంది, సాధ్వసధ్వస్తాంతరంగులైరి నం, గరంబు వింత ॥ 50

వ॥ అని, తెలిపినవిని, యవ్వలివృత్తా[illegible]ట్లని, వీణాపాణివాణీజాని నడుగఁటయును ॥ 51

ఆ॥ సిరులువోలయునోషలగరగరిబూదిపూఁ
తయును, జడలనమరతటిని, సామి
దేహమందు భూభృదీహితఫలము, శ్రీ
గౌరిపెలయుదేవ! కపిలమల్ల !! ॥ 52

ఇది, ఆంధ్రీకృతముక్తీశ్వరోపాఖ్యానమునందు
జానుమండలప్రతాపవర్ణనమను
చతుర్థాధ్యాయము.

శ్రీరస్తు

# ఆంధ్రీకృతముక్తీశ్వరోపాఖ్యానము

## పంచమాధ్యాయము

ఆ॥ సిరులకిరవుధరణినరసాపురంబు సు
స్థిరనివాసమని, మదిందలంచి
యున్నసుజనకోటికెన్న, ముంగొంగుబం
గరువుగావె, నీవు కపిలమల్ల ! ॥ 1

ఆ॥ అవధరింపు; దేవ! యవ్వలివృత్తాంత
నమరమునియడిగెనబ్జగర్భు
"నమరులమృతపాయులయ్యు, నట్లేలయ
య్యసురవలనమిపుడనుసురువడిరి ?" 2

ఆ॥ "ఆయుపేక్షయేటికో, యింద్రముఖ్యుల
స్రేయుపాయమూని రేమిసేసి
రో" యటంచు, వినఁగనాయతకౌతూహ
లంబుగ గ్గైహామనంబునఁదు ॥ " 3

వ॥ అని, యడిగినసురమునికినలువయిట్లనియె ॥ 4

ఆ॥ "వినుము; వత్స! నీకువివరించిచెప్పెద
నసురులట్లుబాములంది, కుంది,
దానిమాలుసేతఁగానక, వానిసై
రింపలేక, సురలు, ఋషులుగలిసి ॥ 5

ఆ॥ ఇంద్రుఁజేరి, మ్రొక్కి, యిట్లనివిన్నవిం
చిరి—"మహేంద్ర! రాత్రిచరుఁడుమనలఁ
బెట్టుబాములెట్టివట్టిట్టివనఁగాదు;
పారమున్నె ? దేవ! మేరయున్నె ? ॥ 6

ఆ॥ నీవురాజజయ్యు, దేవేంద్ర! మాకు నీ
బాముఠేమి ? నీదుభావమేమి ?
యేలయీాయుపేక్ష? త్రైలోక్యనాథ! మే
మోర్వఠేమురాక్షసోగ్రబాధ ॥ 7

ఆ॥ లెమ్ము; శత్రుఁజీల్చ, లేఖాళిఁగష్టాబ్ధిఁ
దేల్చ; నాథ! నీవనల్పవిక్ర
మైకనిధివిగావె? నీకసాధ్యంబేది ?
మమ్ముఁగావుమయ్య! సమ్మతోష ॥ 8

ఆ॥ అకట! నందనంబు, నాసుధర్మయు; వైజ
యంతమమరనది, యనంతవాంఛి
తార్థదోగ్ధ్రి, ధేనువాకల్పవృక్షంబు
లసురుస్వార్జితంబులయ్యెనేఁడు ॥ 9

ఆ॥ ఎంతకష్టపడార! యింద్రుఁడు సేవించు
నేమువానిఁ బెద్దగా మదించ
లంచి, కొల్చి, పొద్దులుంబుచ్చు దుస్థితి
కై మఱెంతవంతగల్గుచుఁడు ॥ 10

ఆ॥ అధముఁడసురముఖ్యునకైతద్దాసులఁ
జేసి, పనులఁ దేరఁ జేకొనంగ
నెత్తియుమనముమిన్నుల; నెంతటిపగవాని
కైనవలదు-వలదుదీనవృత్తి ॥ 11

ఆ॥ ఈశ్వవృత్తిమాకునీశ్వరకల్పితం
బయ్య, దీనదీనమైనజీవ
నంబుదీనఁబుచ్చుచుంబయిలోడి, కి
గ్గాడియసురఁగొల్వఁగాఁదరంబె ?॥ 12

ఆ॥ వజ్రివయ్య, మేఘవాహుంతవయ్య, నా
ధుషణునంతవాఁడిధిషణబలిమి
శిక్షగల్గునీవశేషశేముషిలేని
ముట్టుబూరకోమహాత్మ! తగునె ? ॥ 13

ఆ॥ నేము సేనఁజేయ లేము వానికి దేవ !
జీవనంబుగూడ పీడితంబుఁ
గూర్చుచుండెమాకు, గహ్వరాదులప రా
క్రమముకొల్పనా ! స్ఫురత్ప్రతాప ! ॥ 14

ఆ॥ అధిప! యమృతపానమపరాధమయ్యె; దుః
ఖైకమూలమయ్యెనదె మనునపు
ట్టుదసేవమాన్పి, భద్రంబుఁ గూర్పుమీ
దైన్యమేల? మాకు దైన్యమేల ? ॥ 15

ఆ॥ గుణుని గుణములేని నురుతరోపాయముసా
హింసఁజేసి, దేవ! యీసురుమును
నీసుబలకుడైన్యమెల్లఁబోకార్పవే
కూర్పవేముదంబుకులిశపాణి ! ॥ 16

ఆ॥ ప్రభు! దురంతసేవ "అంపపుకోఁతగా,"
బాధఁగూర్చునిర్నిరోధవాచు
నేర్చుమామనంబుఁగార్చిచ్చునోలె; నీ
నేర్చురీతిమమ్ముఁదేర్చుమయ్య ! ॥ 17

ఆ॥ నింద్యమీనితాంతనిస్త్రీజమైన జీ
వితముఁగషపలేముబిబుధనాథ !
సేవకంటెమృత్యువే, వరంబగుఁగాదె !
జీవితాంతమార్తిఁజేయుసేవ ॥ 18

ఆ॥ లోకమందుదీర్ఘరోగి, ప్రవాసి, య
న్యావసధనివాసి; సేవకుండు
చెప్పఁదగుదురెప్డుజీవన్మృతులటంచు
నెఱుఁగవోకో, నీవు! సురగణేశ ! ॥ 19

ఆ॥ విక్రమాఢ్యుఁడేని, విద్వాంసుఁడేని, స
ద్గుణవిశిష్టుఁడేని, స్తోకమంజు
భాషణుండయేని, భంగమొందుటధ్రువం
బమరనాథ! వఱపుడమునసిరో ! ॥ 20

వ॥ దేవా! యేమనిమనవిసేయుదుము? సేవయేవృత్తిగాస్వీకరించిన
మూఢుండు దేహంబులందుస్వాతంత్ర్యంబు శూన్యంబు. అరణ్యం
బులవర్ధమానంబులైనవృక్షంబులకుంబోలెదూరాత్తైన్యంబంత
హైన్యంబుఁదెచ్చునో యనియునెఱుంగకుండునీచులకుస్థానిత్వంబు

పరమప్రాప్యంబు భానుమంతుండు హిమానియుంబోలెం జంద్రాతపం బంధకారంబునుంబోలె స్వేచ్ఛాధీనత్వంబు సకలసుగుణంబుల నణంచుచుండు. మఱియు, వృత్రశత్రూ! శత్రుసేవాదౌర్భాగ్యంబు మాకత్యంతదుస్సహంబైన వేదననాపాదింపుచుండుఁ. పరంబైనభూతింబొందియానందించిన మేమిప్పుడు పరాభూతింబొంది, కుందుచున్నవారము. మహామహా! యిప్పటికైనను పేక్షనుజ్జగించి ద్విషజ్జనంబునిర్జించి, యీనిర్జరులంగాపాడనోపవయేని, మేము వశ్యంబు శత్రువ్యాపాద్యమానులమౌటతథ్యంబునుమీ!" యని నుడువుచు, వక్కాణించుచు, దీనదృక్కులందన్నుంజూచుచున్న యజ్ఞభుక్కులకక్కుభృద్విభేత్త యూశ్వాసపూర్వకంబుగా, సవిశ్వాసంబుగా, నిట్లనియె ॥ 21

ఆ॥ "ఎఱుకలేనివాఁడనే? సురలార! పాపిలాస్మలి, మిమ్ము విడుతునే ? లఘుత్వ
శాలినే ? జగానశాలీనులే, భవి
తవ్యతనుమఱల్పఁదలంచువారు? ॥ 22

ఆ॥ ఎచట, నెప్పు, డెట్టులేభవితవ్యత
నియతినియమితంబొ, నిజమువుండి !
యచట, నప్పు, డట్టులాభవితవ్యత
తప్పఁబోదు; వేఱుసెప్పఁగాదు ॥ 23

ఆ॥ జానుమండలాభిధానుఁడుగ్రతపంబొ
నర్చి, బ్రహ్మఁగూర్చి, యర్చిరాది
మార్గగాములైనమహానీయులనుగూడఁ
బట్టి, వాఁడుబిట్టురట్టుసేయు ॥ 24

ఆ॥ వరముఁబడసినలువవలన, నయ్యసుర మా
ఱొండులేక, తనకు, నెల్లలోక
ములకుఁగాధఁగూర్చు; మురహరహరులేమి
సేయలేరువాఁడ జేయుఁడౌట ॥ 25

ఆ॥ కర్తగలఁడశక్యకార్యంబునకశక్య
మైనదానిఁజేయలేనివాని
కుప్పతిల్లఁబోదుకుప్ప తెప్పలుగాఁగ
దుశ్యశంబమర్త్యవర్యులార ! ॥ 26

ఆ॥ జానుమంతలాభిధాను నేసంహరిం
పఁగవలంతిఁగాను; బ్రహ్మవల్ల
నయ్యెఁగాన, నసురయంతవాఁడిప్పుడం
దఱమొనర్తమజానిదర్శనంబు ॥ 27

ఆ॥ అతఁడెమనకుశరణమాతండెసంభద్రి
సంవిధాతయెల్లస్వర్గివర్గ
ములకు; సందియంబువలదింక; సత్యలో
కమునకేఁగి, బ్రహ్మఁగాంచి, మఱియు ॥ 28

॥ అతనిచరణయుగళికర్మలిమ్రొక్కి, ప్రా
ర్థించి, సత్కృపారసాంచితంబు
తత్కటాక్షమంగళోత్కృష్టవీక్షణో
త్కరముఁగరముఁబడయుదము; పోదఁడు ” ॥ 29

॥ అనుచు, వారిఁదేర్చి, యమరవిభుండు సు
స్థిరము, సిద్ధసేవ్యమురుశుభప్ర
దంబు, దీప్రమప్రతర్క్యమనాలోక్య
మైనసత్యలోకమట్టిచేరి ॥ 30

ఆ॥ సురలతోడ, మునివరులతోడను గూడి
వజ్రిపాణిభక్తి బ్రహ్మఁ గాంచి
మ్రొక్కి, వేడి, తమ్ము రక్కసుండొక్కఁడు
బెట్టుబాధ లెల్ల వినిచె నిట్లు ॥ 31

ఆ॥ "దేవ! జానుమంతుఁ డీవేల్పులకు, మును
లకుఁ, ద్రిలోకవాసులకు వృథావ్య
థానితాంతహానిఁ దాఁ జేయుచున్నాఁడు
వానినెల్లఁ జెప్ప వశముగాదు ॥ 32

ఆ॥ ఎఱుఁగవా కొ! నీవు సరసిజపీఠ ! స
ర్వజ్ఞమణివిగావె, ప్రాజ్యతేజ !
యెఱుఁగనట్టులుంట యిది చిత్రమేలా ? సమా
దేవ! నీకు, మమ్ముఁ బ్రోవుమయ్య ! ॥ 33

ఆ॥ జానుమంతనాభిధానుఁడౌ రాక్షసుం
డేర్చె లోకముల, నహీనమైన
త్వత్ప్రసాదలబ్ధవరగర్వమునఁ జేసి
వాఁడజయ్యుఁ డయ్యె నేఁడు జియ్య ! ॥ 34

ఆ॥ వాగధీశ యిష్టు త్వన్మూలకంబైన స
మాభయంబుఁ దీర్ప, మమ్ముఁ దేర్ప
నీవ నేర్తు; వన్యులేవారు నేర్తురు ?
దేవ ! కావరావె, దివ్యతేజ ! ॥ 35

ఆ॥ స్వభోగులైన సర్వగీర్వాణుల
ప్రపుని పంచపాళి నిపుడు సాల
గుడుచుచుండి రెత్తులుపడిగా పురంబడి
తొలఁగునా కొ! యిట్టి తొలఁగవా కొ ! " ॥ 36

|| అనుచు, మనవిసేయునమరాధిపునిఁ జూచి
బ్రహ్మ వల్కెఁ దానజిహ్మమధుర
మధురఫణితి, ముదిరమందరిస్వరాఢ్యమౌ
వచనరచనమెలయఁ, బ్రచురకరుణ ||

|| "శతమఖముఖనిఖిలబర్హిర్ముఖప్రముఖులారా! వినుండు. వానికి నేన, వాంఛితార్థప్రదానంబున్ జేసినాఁడ. వాఁడు నావల్ల నేగదా ప్రాప్తోదయుండైనవాఁడు! నేను వానినాశంబునకుం గారకుండఁను గారాదుగదా! తెలిసి తెలియమలతికమకలందమలక, విషకలుషితంబును, గంటకసంకటంబునైన వృక్షంబును బెంచి, పెద్దసేసి, చేఁ జేతలందలం ద్రుంప మటంగలందలంచునైననెవ్వానికేనిం జెల్లునే? యద్దానవుండు దృఢుండై, యభ్యుత్థానంబునొంది, భవదభ్యుదయంబునకున్ నిరోధకుండై, దౌష్ట్యసాధకుండై, ధూమకేతువుం బోలెం దోఁచుటెట్టకో యని, యాలోచించియున్, హేతువేమియు గోచరంబుగాకున్నయది. ఇయ్యది నాదోషంబుగాదు సుఁడీ! దారుణంబైనతత్తపోవిశేషంబుమాకు "ముంగాలిబందమై", వాని కోరికమేరకంగీకారంబుఁ దెల్పుటయలంఘనీయంబయ్యెఁ, గడచిన శుభాశుభంబులకేమి-గాని, ప్రస్తుతకర్తవ్యంబాలోచింపవలెఁ గదా! "గతజలసేతుబంధనంబునం"గలిసిదికాసంతగాని, వచ్చునదికాసంతగాని, సుంతగానిపించునే? ఐనను, మీకొక్కమాటఁ జెప్పెదం; బరాకులేక, యాలకింపుఁడు|| 38

|| యాతుధారుఁ జంప, లాతులెవ్వరు వలం
తులు? సుధాశనులార! యాతఁ డిక కంఠ
నాథుఁడొక్కరుండె గాధాన్యవిక్రమో
ద్యముఁ బడయఁ దగు ప్రియతఁడెగాక || 39

ఆ॥ జక్కడంచిచక్రిపెక్కుర, దుష్టరా
క్షసులఁ, గొల్లి దేవగణముఁ బ్రోచె
శ్రీశుపాద్రిపుఁ గాంచి, శ్రేయముల్ వొందని
వాఁడెవండు? వాఁడెవండయేని ॥ 40

ఆ॥ ఆదిదేవుఁడతఁడు, వేదవేదాంగసం
స్తుత్యమహిముఁడతఁడు, సుప్రసన్నుఁ
డయ్యెనేని, మనకునభయమిచ్చెనయేనిఁ
దక్కవేమి? దైత్యులెక్కయేమి ? ॥ 41

ఆ॥ సర్వరక్షకుఁడు, సర్వభవోద్భవుం
డైన శ్రీశువల్లనభయమంద
సేగుటెల్లఁజెప్పి, "నాగేశశాయి! మ
మ్మేలుకొమ్మనంగ," మేలుకల్గు" ॥ 42

ఆ॥ అని, శచీశుఁ బల్కి, యావాగ్వధూటీశుఁ
డెల్లవారిసురమునీంద్రపాళి
వెంటఁబెట్టుకొనియె; వేవేగనేగెన
సుందరమహిమమగువైకుంఠమునకు ॥ 43

మ॥ కనియెన్ దవ్వులవాగ్వధూధవుఁడు, న్యకార్యాస్తమాయాతనై
జనిగూఢోరుమహత్త్వభాక్కులగుయజ్ఞస్వత్వభుక్కుల్, నితాం
తనిరీహుల్ దనవెంటరాఁ, బ్రచురమాన్యప్రాభవుం డైన శ్రీ
శునివాసంబు, వికుంఠపట్టణము, నక్షుద్రప్రభావాఢ్యమున్ ॥ 44

చం॥ కనుఁగొనెవాగ్వధూధవుఁడఖండమహోమహితంబుఁ, బరిస్ఫుర
త్కనకకవాటశోభితసుధాధవళోన్నతరమ్యహర్మ్యమున్
మణిమయభూషణోత్కరకనద్వపురుజ్జ్వలవేషధారిస
జ్జననివహానుభూతసహజస్థిరము క్తీవధూపగూహమున్ ॥ 45

శా॥ కాంచెం గాంచనగర్భుఁ డుత్సుకతఁ సాక్షాత్కారముం గోరి, య
భ్యంచద్భక్తిసమృద్ధినిష్ఠితరమేశోపాసితశ్రీపాదాబ్జుని
శ్చాంచల్యప్రియు జగజ్జనురదృష్టస్ఫారరేఖామయూ
ఖాంచచ్చక్రకునవక్రవిక్రముని, నిత్యశ్రీగృహ[లస] ద్వక్షునిన్

ఉ॥ కాంచెనుఁ బ్రౌఢపుణ్యులనుఁ గాంచనగర్భుఁడు, స్వర్గివర్గము
ఖ్యాంచలచంచలేతరనిరంతరనిర్మలమందహాసరే
ఖాంచితరమ్యచంద్రికసుధాంశునిజాస్యబింబముం
దుంచినయట్టులొప్పెడుమహామహితున్, గమలాసమన్వితున్
[మనోహరున్] 47

వ॥ అట్లుగాంచి, కాంచనగర్భాదులు గాంచనాంబరుం, బరాత్పరుం బునఃపునఃప్రణామనామసంకీర్తనాదులఁ సాదరామోదమేదురాంతరంగులుం గావించి, యించుక సంబాళించుకొని, వినయవినమితతనులయి, తనుతరవచనరచనం ద్రిచతురపరిమితాక్షరంబు లొప్ప నిట్లని విన్నవించిరి. "దేవా! మా విన్నవించుమాటల నొక్కించుక సావధానంబుగా నవధరింపవేఁడుకొనుచున్నారము. రమేశా! జానుమన్నామకుం డైనమానవాశనుం డొక్కరుండు మమ్మెల్లరం జిల్లిగవ్వకుంగొఱగాఁగనుంగొనక, కనుంగొనలం గనలగ్గలం బై, కనకసమను నగ్గియుంబోలె, సెగలుమియువడుపున నెల్లజీవుల జీఱాపసీయక, మా తెందు లేక, యేము నీవారమను గౌరవంబు నీనారథూకాగ్రిమాత్రింబేనిఁ గనక, వీఁకమైనుద్రేకంబుప్రవేకంబుగా, నాకులమైనమాకు నాకులపాటుఁ గావించుచు; నాకులచాటు పిందెవంటిమా యొంటరిజీవితంబులు బయటఁబడ, బడలియడలు మమ్ము ముమ్మరముగఁబట్టి పల్లార్చుచు, సోఁకోర్చుకొన్న కొలందియుఁ దొక్కినను దలయెత్తని బురదపాములుగా మమ్మ

నెమ్మనమ్మునం దెంచుచున్నవాఁడు. వాఁడేనాఁడేమిగా సన్న వాఁడో - కాని, నేఁడుసూతులుగాఁ జేయనోపకుండను, నేను గడయుండియు, లేనివారమై, వానిబారింబడిపాలిపోవను లేకున్న వారము. వానివల్లనైన యీరాటంబును సైరింపను నేరకున్న వారము. పారావారశాయీ! యీశానాదులెవ్వరుం గాని వాని డాకను డీకొను వారు లేరు. భవచ్చరణనళినయుగళభజనానితరసులభ నిరంతరనితాంతసాధనాంతరులమై, దీనతాఽధీనాంతరులమైన మమ్మెట్టులుద్ధరించెదవో, యుద్ధవాగ్రజ! భుజాంగ్రిజాగ్రచ్చక్రధారా విదారితక్రివ్యాద్చక్ర!" యని, ప్రార్థించుచున్న వారి దీన వాక్కులకక్కమలామనోహరుండు కరంబునికరంబయినకనికరంబు మెఱయ, సురమునినికరంబు విన, సరసిరుహాసంభవునితో నిట్లనియె

సీ॥ "వినవయ్య! హంసవాహన! సురజ్యేష్ఠ! నా
కౌకస్సులార! మహర్షులార!
వినుఁడయ్య! రాక్షసవీరునిమారణో
పయంబు; మఱి, వాఁడు జేయుఁడౌను
మీకును, నాకును; లోకేశదత్తమా
వరమునఁ జేసి దర్పంబుమదిరె
స్పృష్టపూర్వులు సర్వసేనాఽఽఢ్యులైనని
ర్జరులును, యక్షకిన్నరులు, గుహ్య

గీ॥ కాదులే-కాదు; నేనైన, నాబలాఢ్య
జానుమండలుఁబోరిఁ బోఁడంపలేము
తపమొపర్చుటం జేసినత్ఫలమునొంటెఁ
గావున, ననాథ్యుఁ డయ్యెరక్షశ ప్రభుండు ॥ 49

ఉ॥ ఐన, వచించువాఁడ; నమృతాంధసులార! వచోలవంబు;దా
పైనదివానినాశము; మహోమహిమైననమహేశునంశజుం
డౌ నరనాథుచేత నభిరూఢి యవశ్యము నాశమొందు; నే
దీనిని యోగసంజనితదృష్టిఁగనుంగొనినాఁడ; నమ్ముఁడీ! ॥ 50

ఉ॥ కావున. మీరలంపెఱు "నెకాయొకి" నారజతాద్రికేగి, గౌ
రీవరు,లోకశంకరుని, నృత్యుని జేత, గిరిశు, నీను,న్
దేవతలార! చాలగను[illegible], నక్కఁజేసి-తదీయసత్కృపన్
మీ వెత బెల్లఁబాసికొన నేకొనుఁడయ్య!జగచ్ఛుభంబగున్॥ 51

చం॥ పరమశివుండకారణకృపా భరితాంతరుఁడంతకాంతకుం
డునుతరగౌరసుందరమనోమహితుండు. హిమాద్రిపుత్రికా
వరుఁడు, మహాత్ముఁడీశ్వరుఁడవశ్యమువశ్యతఁగాంచుమీకు; నే
నెఱుఁగుదుఁదత్ప్రభావము; మహోన్నతదుత్తమసత్త్వభావమున్ ॥

చం॥ చనుఁడుసురల్! మునుల్! చనుఁడు; చయ్యనసేభవదగ్రిగామి నా
దును; బరమేశ్వరుండవిదితుండె? మహాత్ములు,బ్రహ్మవేత్తలా
ఘనులకు? స్రష్ట,భర్తయుఁ,బరిగాఢమహాత్ముఁడుమేశుఁడవ్యయుం
డనుపమితాదరాన్వితమనోఽబ్జుఁడు,మీకుఁబ్రసన్నుఁడయ్యెడున్"

వ॥ అని, పలుకుచున్న శ్రీమన్నారాయణునమేయోపాయసూచకంబు లైన వాక్యరబుల కెంతయు సంతసించి, సురలును,మునులును హరిని, హిరణ్యగర్భునింబురస్కరించుకొని, వ్యోమమార్గంబున నిర్గమించి, యమితద్యుతియు, నుత్తుంగశృంగభూయిష్ఠంబును, రత్నకందరసుందరంబును, నామేఖలసవిలాసవిహారసలాలసవిద్యాధరద్వంద్వసంచారాంచితంబును, భస్మరూషితాదూపితసర్వాంగీణులు, నానందమానందసందోహకుంది మానసారవిందులును, శంకరకింకరత్వని[illegible] [illegible]యుక్తులునైన ప్రమథగణంబుల చేతం బరికీర్ణంబును, హసా[illegible] [illegible]కాశంబును, గోటిచంద్రప్రభాపరిభాసమానంబును, [illegible]త్యంతిపర్వత సమన్వితంబును, సంతుష్ట

సర్వస్వర్వేశ్యాపశ్యనిత్యజ్యోత్స్నావిహారంబును, దివ్యౌషధీ
ప్రభాప్రభావితంబును, శ్రవణసుభగవిరుతయుతకలకంఠకుల
కలకలబధిరితదిశాదిశావకాశంబులును, దప్తకార్తస్వర
భాస్వరత్వగ్వర్ణనీయంబులును, విస్తారసమస్తవిటపప్రచ్ఛాయం
బులునైన కల్పవృక్షంబులచే సమాకీర్ణంబును, ఘటితఘటీ
సమాటోపాటీకనటనష్టనతకపృథూధస్స్ఫూర్తులును, సంపూర్ణ
ఘార్ష్ణిమాచంద్రమూర్తులును, సముత్తుంగశృంగనాథంబులు
నైన కామదోగ్ధ్రీసధ్రీచయూథంబులచేఁ బరితోవ్యాకీర్ణంబును
బ్రతిప్రస్థసుస్థిరస్థితపరమహర్షిమహర్షిపవిత్రితంబును, బుణ్యగణ్యమహా
మహిమమహితపరమశివగాథాగాయద్గంధర్వకిన్నరబృందంబును
గిరీశగౌరీపాదాలక్తకచిహ్నితసానుకంబును, శతాధికశివాయతన
సోపానోపశోభితంబును, దివ్యోద్యానసముద్యోతితంబును,
బుష్కలదివ్యపుష్పసుగంధగంధిలంబును, భవ్యస్తంభసహస్రభవ్య
దివ్యభద్రమంటపమండితంబును, దివ్యరత్నప్రభా
కీర్ణంబును, దివ్యకుట్టిమసముట్టంకితంబును, దివ్యకీరశారికా
వారోద్గీ "తేశానస్సర్వవిద్యానా"మిత్యాదీశానగాథానైకోద్గీథ
సాధుగాననాదమేదురంబును, సంతతబహిరంతస్తమస్సంతాన
నాశంకరంబును శంకరవాహశాక్వరరాజారబ్ధోత్ఖాతకేళీవైచిత్రీ
వ్యాఖ్యానపరిఖ్యాపనసానుభాగభోగాభోగంబును రాశీభూతామందా
నందక్షీరవారాశియుంబోలియున్న కైలాసశైలంబును సందర్శించి
వాసవాదులైనసురాదితేయులందఱు వందనంబులాచరించి, మంద
మందగమనంబులతో నయ్యద్రిరాజంబునారోహించి, చక్షురక్షు
ద్రోత్సవసంధాయకంబులును జిత్రవిచిత్రధాతురాగధారాధౌత
ప్రకటకటకశిఖరబహుముఖవిరాజితంబును, సప్తర్షిగణసేవితంబు
నైనయీశ్వరస్థానంబుఁ జేరఁగాంచిరను॥ 54

సీ॥ రత్నవిష్టంభసంక్రాంతకాంతివిశేష
రూపితాశాముఖాశేషశోభి
సంతతానంతపుష్పలతావితానసం
వ్యాప్తాంతరిక్షకళ్యాణకాయ
మానమానితము, చిత్రితమానసింహాస
నాసీనపారిషదాభ్యభితశప
రిష్కృతాంతరమును, బుష్పలపుణ్యాఢ్య
సజ్జనశ్రేణిసంసజ్జితంబు
గీ॥ స్వర్ణమాణిక్యకుట్టిమాభ్యర్ణరత్న
రమ్యసోపానపంక్తి, విస్ఫింభసంభ్రి
మభ్రిమద్భృత్యవర్గసంభాసమాన
మై, యనన్యసామాన్యవిఖ్యాతినొప్పు॥ 55
వ॥ అందు॥ 56
మ॥ దళదిందీవరమింద్రనీలము సముద్యన్నైజదేహప్రభాzz
వళికెంతేనియునప్పులన్ మునుఁగ, దూర్వాజగ్ధిసంత్రాసమొం
ద, లసన్మూర్తినెసంగు కాళి, నిజకాంతన్, గాంతదేహార్ధమం
దెలమిన్ దాల్చినదేవదేవుని,శివున్, మృత్యుంజయుంజిన్మయున్
కం॥ స్కందుఁడు, ద్వైమాతురుఁడును,
నందియు, భృంగియును, తండునాముండునుభ
క్తిందద్దయుసేవింప, న
మందకృపందన్ని, వారిమన్నించువిభున్॥ 58
ఆ॥ చంద్రిపాళి, నీశు, జాజాలిముఖ్యమా
నీంద్రపాళిచెవులకింపునీఁపు
వచనరచనముదముఁబ్రిచురంబుగాఁగొల్వ
జేశికాగ్రిణ్యు, దేవదేవు॥ 59

ఆ॥ పుణ్యమూర్తిఁ, బంచముఖుఁ, మూఁడుకన్నుల
వేల్పు, వేల్పుటేఱు వెఱయుజడల
యడవిమిగులనిండునడఁగొండకొనబోని
శిరముగల్గువిభుని, శివుని, భవుని ॥ 60

కం॥ కనుఁగొని, వెన్నుఁడు సాష్టాం
గనిపాతముగాఁగ మ్రొక్కి, గౌరీనాథుం
డును, హస్తగ్రాహముగాఁ
గనుదనప్రియమిత్రుఁ దన్వగాఢాదృతిమైన్ ॥ 61

ఆ॥ కన్నసన్నఁ జేసి, వెన్నుండు నాదితే
యులనువిశ్రమింపఁ దెలిపి, తాను
ప్రావృషేణ్యవారివాహగంభీరగ
ర్జానుకారికంఠుఁడై, నుతించె ॥ 62

సీ॥ ఈశాన! సర్వజ్ఞ! యీడ్య! గౌరీప్రాణ
నాథ! భక్తాఘౌఘనాశ! వ్యోమ
కేశ! కంఠేకాల! కృత్తివాసస్సంజ్ఞ!
ఫాలాక్ష! పంచాస్య! శూలహస్త!
షాడ్గుణ్యపూర్ణ! షడ్విధగణాహంకార
మార్జనచణభుజాఖడ్గ! దుర్జ
నాగోఽసహస్వతేజోఽభితోవ్యాపిత
విశ్వవిశ్వ! మహోక్షాశ్వయాయి!

గీ॥ పంచకృత్యస్వకృత్య! యకించనత్వ
బాహ్యరూపస్వరూప! యనూహ్యదివ్య
కృత్య! కృతకృత్యులీభవద్భృత్యులెల్ల
నీదుదయపేర్మి నిప్పుడ నాదినిధన! ॥ 63

సీ॥ ఏమూర్తి సూర్యాదిహవ్యాసృష్టి, యేమూర్తి వ
హించుహవ్యము, హోత్రియేది, యేవి
రెండుమూర్తులును గల్పించునహోరాత్ర
ములను, శబ్దాశ్రియంబునఁ బ్రసిద్ధ
మెయ్యది, ప్రకృతియీయెల్లబీజ[భూత]ములకు
నేది, యెద్దానదేహివ్రజంబు
ప్రాణవత్త్వముఁగాంచుఁ, బార్వతీనాథ! యీ
యష్టమూర్తులఁ జేసి, నష్టివర్జి

గీ॥ తముగ సర్వాత్మనాజగద్ధారణంబొ
[illegible]వుమహేశ! యనాథనాథ!
సార్థకముసీకుసీశ్వరాహ్వయముదేవ!
యీశనంబునఁ జేసి, యహీనభావ! ॥ 64

వ॥ దేవా! నీవు నిఖిలసుఖప్రాపకుండవౌటం జేసి, శంకరుండవు. సకల శుభకరంబులయిననిజకృత్యంబులొప్పుటం జేసి శంభుండవౌదువు నీవిదియెవ సూశివశంభుశబ్దంబులునిత్యసాపత్యమానంబులైనీవియుం బోలిపవిత్రజనంపముడ యముసకు సతతవిభూతింబ్రభూతంబుగాఁ గల్పించు; మృత్యుభీతింబాఱఁదోలు; బాధలంబాపు. వైజ్ఞానికులును, యోగనియతాత్ములునైనవారు నిన్నే శరణంబునొందుచుందురు. నీచారిత్రంబులు నీచారిత్రంబులుగాక, సర్వాశ్చర్యచర్యంబులు, సర్వాగణ్యంబులునౌనుగాదె! యెట్లన-నీప్రశ్మశానసంవాసివయ్యు, మహాత్ములపరమహృష్టపరిపూతహృదయగుహాకుహరంబునన్ గాని, రజతశిఖరిశిఖరంబులంగానిఁ విహరించుచుండు పంచాస్యమూర్తివిగదా! ఆదిభిక్షుసమాఖ్యాసమాఖ్యాతుండవై బుభుక్షలేకయేయీవుభిక్షాటనంబులీలామాత్రంబుగా స్వీకర

రించియు, యక్షాధ్యక్షసహస్రాక్షులకసదృక్షంబుగా మహైశ్వర్య
మహాసౌఖ్యప్రదానంబుఁ జేయుచుండుటఁ బ్రధానంబుగాఁగల్గి
యుండువుగాదె! మహోత్కృష్టస్తోత్రకుథాఽఽసీనుండవై, కోంచ
పీఠిమింపజంగంబవై, నటయాడుచుండువాఁడవయ్యు, నైరావణ
వాహుడులైనసూరాదితేయులందఱిచేతనువందనంబులనందుకొనుచుఁ
గ్రందుకొనునమందానందంబునొందుచుండువుగదా! యదియునుం
గాక ॥ 65

చం॥ అవనిరథంబు, పుష్పవనన్గ్రహవేగరథాంగయుగ్మమున్
సవిషఫలాత్తమత్తనువిశంకటమూర్గణమున్, జతుశ్ర్యుతుల్
జవయుతరథ్యముల్, సరసిజప్రభవుండునుసూతుఁడున్, సుమే
రువుధనువబ్ధితూణముగఁ బ్రోల్లనుమూఁటినికూల్చితీవుగా॥ 66

సీ॥ లోకముల్ పదునాల్గుశోకచిచ్చెకాల్చు
కాలకూటముమ్రింగఁజాలునెవఁడు
మృత్యుదేవతనోటిమెఱుఁగుఁగోఅలుడల్చి
మునిసుతుబ్రతికించుపోడియెవఁడు
తారకాసురుధాటిదల్లడిల్లుజగంబుఁ
గావ, షణ్ముఖుఁబుత్త్రుఁగాంచునెవఁడు
విశ్వనాథుండునా, నీశ్వరుండనఁగ, సా
ర్థకనామధేయవిభ్రాజియెవఁడు
గీ॥ నీవుగాక; యేవంవిధానావదాన
మానితానూననానాఽఽగమప్రసిద్ధ
శుద్ధనిత్యయశోవ్యాప్తిశోభిదశది
శాఽవకాశుఁడెవ్వండు? దేవదేవ!! " ॥ 67

వ॥ అని, సబహుమానంబుగా, బహువిధంబులన్ దన్ను స్తుతియించు
చున్న శ్రీమన్నారాయణదేవునకన్నీలగిరీశుండిట్లనివాక్రుచ్చె

ఆ॥ "నీకు, నాకు భేదమేకొంచెమునులేదు; నీవెనేను; నేనెనీవటన్న
సిద్ధసూక్తిఁ గొంతబుద్ధినూహింపుమా! శ్రీరమాధినాథ! సాధుబోధ!!

ఆ॥ వేఱులేదుమనకుగోరంతయేని; దే
హములు వేఱుగాని-యాత్మయొకఁడె
నీకుభక్తులైన, నాకునుభక్తులౌ
దురన, నీవెయెఱుఁగుదువుమురారి! ॥ 70

ఆ॥ ఇట్టులేలవచ్చితెలియఁగింపు; నీకోర్కె
యేమి? లోకములకుహింసలాచ
రించుదుష్టదైత్యులెందైనఁ గ్రించుఁద
నానఁబెల్లురేఁగినారో! చెప్పుమ !! ॥ 71

ఆ॥ సురలకయిన, నవనిసురలకునయినను
గుమతులెవరుగాని, కుచ్చితమునఁ
జెట్టసేయ సాహసిత్వంబుఁ జూపిరో!
తెల్పితేని, వాండ్రఁ ద్రెంపడమణఁతు ॥ 72

ఆ॥ ఏమికారణంబు? దామబృందారకుల్
తేరుతొంటియట్లు; పేర్వైన
దీనభావమునకు, హీనభావమునకుఁ
గారణంబదేమి? శ్రీరమేశ ! ॥ 73

ఆ॥ వజ్రపాణిశూన్యభావుండుగాఁదోఁచు
నేల? దుఃఖితుండువోలెఁదోఁచు
వహ్నియాజ్యగంధవాసితుండుగలేఁడ
దేలనిష్ప్రభత్వమితఁడుపూనె? ॥ 74

ఆ॥ తెలుపుమితఁడుయముఁడె? దీప్తదండాభిమం
డితుఁడదేల మున్ను నిష్ప్రభాపుఁ
డట్లుతోఁచు? మొగమునట్టెదిగాలుగా
వంచియుండె; నేలవ్రాయుచుండె॥ 75

ఆ॥ ధనము నొద్దవోవ, వనటఁ గుందెడు గేస్తు
వోలెవరుఁ డిపుడు మునుపటివలె
లేఁడదేల? చెపుమ ! శ్రీరమానాయకా !
రత్నరాసులం జెలంగువాఁడు ॥ 76

ఆ॥ నిధులతో మిన్న సెంటిక ధిపుఁడయ్యును, బరా
ధీనుఁడైనవాని తెఱఁగుఁ దోఁపఁ
జేయుచుండె యక్షనాయకుం డిది యేమి?
కల తెఱంగుఁ జెప్పు; గరుడగమన! [కమలనయన!] ॥ 77

ఆ॥ దేవతల్ సమస్తదివ్యాస్త్రవేత్తలే
వీరలెల్ల నిందుఁ జేరి రేల?
విన్నఁదనముఁ జూడ, విషమదశామగ్ను
లైనకేటిఁ దోఁచు; నౌన? కాద? ॥ " 78

వ॥ అని, యడిగిన త్రిణయనునకుం గమలనయనుం డిట్లు చెప్పం దొడంగె

కం॥ "ఈవృత్తాంతం బద్భుత
మూ; వృషభధ్వజ! యొకండు; హరిహయముఖులౌ
దేవళ్లై "గుండెగాల" మ
నావిర్భూతాభిమాతి, యాతువరుఁడిలన్ ॥ 8)

కం॥ సురకంటకాఖ్యమానిత
పురవరమున నధివసించి, మునివృత్తిన తం
డరవిందసూతి, బ్రహ్మను
గుఱిచి మహానిష్ఠఁ దపము, ఘోరమొనర్చెన్ ॥ 81

కం॥ తత్ఫలితంబుగ, నోప
శ్యత్ఫాల! విరించి, వరములసురకొసఁగెఁదా
నుత్ఫుల్లహృదబ్జుండయి
యుత్క్షణఘృణిక యైనది, పయోదాసమటుల్ ॥ 82

క॥ తద్గర్వంబున, నా కరి
వ్యాఘ్రగణనాయకుఁడు, జాతివైరంబున, భూ
భృద్గృహమేధీ! బహుదివి
షద్గణములరోయుఁజూవె! సహోత్యతరుఁడై॥ 83

ఆ॥ బ్రహ్మకారణంబువానియాద్ధత్వంబు
నకుగిరీశ! యమరులకసాధ్యుఁ
డయ్యెరక్కసుండజయ్యుండు; దుర్వృత్తి
మాచరించుఁడన్నిశాచరుఁడు॥ 84

ఆ॥ అసుర బలిమి మెసవునకట!యాగభాగ
ములను; శుద్ధసత్త్వమూర్తులైన
వృద్ధమునుల, యోగిబృందంబుఁబీడించు;
నౌర! తెలియువానిదైన తెగువ॥ 85

ఆ॥ అంత, స్వర్గివర్గమబ్జోద్భవుంజేరి,
సెప్పుకొనిరియసురచెట్టలెల్ల;
మాఱుపేయలేక, మత్సమీపమునకు
వారిఁదెచ్చె ధాతపార్వతీశ!॥ 86

ఆ॥ గిరిశ! దివిజులసురగెలువనేరరు లోక
పాలురేనుఁజాలవానిగెల్వ;
దాపుగంబదేల? ఓపురారి! సురారి
సంహరింపనీవసాలుదయ్య!॥ 87

ఆ॥ జానుమంతు, దైత్యుఁజంపక, లేదు క్షే
మంబులోకములకుమాసహాయ!
హాయిఁగూర్పుమయ్య! యంతకాంతక! యంత
మొందఁజేయుమసుర యుక్కివుండు।" 88

వ॥ అని, యిట్లు విషమంబయిన విషయంబును విషమ[illegible]
విశదంబుఁ గావించి, హరివిరమించినంత విరించి యంజలించి, లేచి
సధ్రీచీనంబుగాఁ గుధ్రేశజానికిట్లని విన్నవించె॥ 89

సీ॥ "దేవదేవ! త్రికాలజ్ఞ! త్రిపురదహన!
త్రిణయన! మురారి తెల్పినరీతి, దాను
మండలుఁడసాధ్యచండిమోద్దండవిక్ర
మక్రముఁడజయ్యుఁ డెట్లుతన్మ్రపమాణంతో? 90

ఆ॥ "వరము లొసఁగి వానియురుతపోవహ్ని ని
ర్దగ్ధములను గాక, రక్షణంబొ
నర్పు లోకముల" ననంగ, బృందారకుల్,
హానులిష్టసిద్ధు లేనొసఁగితి॥ 91

ఆ॥ ఇంతకంటె మార్గమేదియు లేక, చే
యంగరాని నేరమైన జేసి,
"యసురయుదుటుకొంత యణఁగుఁగా" కనుచుఁ, దా
త్కాలికమగు మేలుఁ దలఁచినాఁడ॥ 92

ఉ॥ శ్రీహరియిప్పుడన్నటులె సేయుచు దారుణమారణంబుఁ, దా
నోహరిసాహరింజెలఁగుచుండు; సురారిసురాళిఁ దోలి, ఘో
ర హావమందమందగతినడ్డుదలంపక, నిత్యనూతనో
త్సాహమునం బ్రవర్తిలు; వశంవదులిప్పుడు వానికందఱున్॥ 93

చం॥ గిరితనయామనఃప్రియ! శిఖిద్విరదరాజదినేశదృక్త్రియా!
పరమకృపాఽఽలవాల! విభవప్రదదివ్యశివత్వసంస్థలా!!
చరణసరోరుహాశ్రితులసద్యఉపాత్తమహత్త్వపుణ్యభా
గ్వరులనొనర్పనేర్పు మెయిఁగష్టములన్ దొలఁగించి శంకరా!" 94

మ॥ అని, ప్రార్థించి, పితామహుండు దనదానవ్యాజకారుణ్యమున్
గను జేసెం గజగత్త్రాణాత్యయపరత్వప్రస్థబంహిష్ఠసా
ధనముం గా, ధనదార్యయప్రవణుఁడు దవ్యల్లీల, లోలాత్మతన్
జనునల్లెంచి సటీరువిస్పోటులు త్ర్యాహంబసహ్యంబుగన్॥ 95

వ॥ అంత, నిందు రెండును, బ్రహ్మ వాక్యంబునను వదించుచు, నాజాను సుంకలు సరోపదోగంబును, దత్పూర్వవృత్తాంతంబును, బన రుక్తంబుఁగా వించె; నంత, నంతకాంతకుండు చండోద్దండక్రోధా వేశంబున సంరక్తనేత్రాంతకాంతికల్పితాకాండసాంధ్యరా గారంజితదిగంతుండును, సద్యస్సంభూతప్రభూత స్థూలముక్తా ఫలోపమానస్వేదబిందూపబృంహితగాత్రుండును నయ్యె; నంత ॥

మ॥ ఫణికేయూరవిభూషితంబు, దనుజప్రభ్రష్టబృందారబృం
దనితాంతప్రభుతాతదీయవిభవోద్యన్నిత్యశోభాపునః
పునరంతస్స్మరణకుత్రధారుణిత, ముద్యూతప్రభూతశ్రీమాం
బునికాయాసిత మొప్పె శంకరుభుజంబున్ జూడనుద్దండమై 97

ఆ॥ వ్యాఘ్రచర్మధారి, శీఘ్రంబుగస్వబాహు
దండమందు కానఁ గండువుట్టు
నట్లానర్చెరాక్షసాంతకుఁ, గృష్ణాజి
నోపవీతకుండలోపశోభి॥ 98

ఆ॥ కోటిసూర్యతేజుఁ, గ్రోధదూఘు, జితేంద్రి
యునిఁ, ద్రిపుండ్రధారి, నున్నతాంగుఁ,
గాంచనాభు, శాంతుఁ, బంచాక్షరీపరా
యణుని, సింహాసంహానునిఁ, బవిత్రు। 99

ఆ॥ విపులవక్షుఁ, జంద్రబింబాస్యు, శష్కులీ
శ్రీశ్రవున్, యుగోరువృత్తదోర్యు
గాఢ్యుఁ, గంబుకంఠహారి, శ్రీరుద్రాక్ష
మాలికాభిశోభి[సనాథు], పాణినాథు॥ 1'0

ఆ॥ ప్రాజ్యసన్మహత్త్వ, రాజర్షిలక్షణో
పేతుసృష్టిఁజేసెభూతనాథుఁ;
డతని జూచిమునులు, నమరులుఁ, దత్రిత్య
లకులకుతుకమందిరద్భుతంబు॥ 101

వ॥ అని, తెలిపిన, విని, యవ్వాలివృత్తాంతం బెట్టిదని, పీఠాహూనివాణీ
జానినడుగు చుయును॥ 102

ఆ॥ సిరిమగండు, నలువ, సురపతి, క్రతుభుజుల్
గొలువఁగొలువుఁదీరి, చెలువమమరు
గరివ నీ కెతగుర; కపిలమల్లేశ! గౌ
రీశ! నరసపురవరేశ!! యీశ!॥ 103

ఇది, ఆంధ్రీకృతము క్తీశ్వరోపాఖ్యానంబునందు,
మార్కికమాన్యావిర్భావమను
పంచమాధ్యాయము.

---

శ్రీరస్తు

# ఆంధ్రీకృతముక్తీశ్వరోపాఖ్యానము

## షష్ఠాధ్యాయము

ఆ॥ సిరులువొలయునోడలగరగరిబూదిపూఁ
తయును, జడఁ నమరతటిని, సామి
జేహమఁదుభూభృదీహితఫలము, శ్రీ
గౌరిపలయుదేవ! కపిలమల్ల!! 1

ఆ॥ అవధరింపుమవలిదగుకథ;సురముని
నలువకనియె "నిట్లు బలియుఁడయిన
ముక్తహాని చరితమునువినంగనునాకుఁ
గౌతుకంబువృద్ధిఁగాంచుదేవ!॥ 2

ఆ॥ విస్తరింపుతత్ప్రశస్తిని నాకు; ము
క్తర్షి యేమిసేసె? హర్షమునను;
దత్ప్రభావమద్భుతంబు; మహాదేవు
మహిమనాకుఁగూర్చెబహుకుతుకము"॥ 3

వ॥ అని, సవినయంబుగా, సకుతుకంబుగాఁ బ్రతివచనంబుఁగోరి యడి
గిన నిజసుతునకు శతధృతి యిట్లనియె॥ 4

ఆ॥ "వినుము; వత్స! ముక్తమునిచరిత్రముమహా
ద్భుతము, మహితమహిమయుతము; సతము
హరుని బాహునందముందుద్భవించి, ము
క్తర్షి మెుక్కె శివుసకమరులువిన ॥ 5

ఆ॥ అని మెువినయవినమితాననుండయి, యుమా
ప్రియునకధిక హార్దహృదయునకును;
మృత్యుమృత్యునకును, మేఘగంభీరభా
షణుఁడు, ముక్తహాని, సాధుమూర్తి ॥ 6

క॥ "త్రిణయన! త్రిపురాంతక! స
జ్జనహితమహితావదాన! శైలసుతాస
త్ప్రణయధన! ప్రణవసదనా!
నినుఁ దెలియఁగలేరు దేవ! నిర్జరులు, మునుల్ ॥ 7

ఆ॥ ఈచరాచరంబదెల్లనీయందె ని
క్షిప్తమౌను; జగముప్తమైన
మఱిమాడ్కి; దేవ! మఱియూర్ణనాభకా
నాయమట్లసృష్టి, నష్టిమౌను ॥ 8

ఆ॥ స్యందమానమైనసరిదుత్కరము సము
ద్రమునఁజొచ్చునట్లుత్వత్ప్రలీన
మౌనుభూతజాతమంతయు; బ్రహ్మవి
ష్ణ్వాదులెల్లనీదునంశభవులె ॥ 9

ఆ॥ సర్గరక్షణములు, సంహారమునొనర్తు
వీవెయష్టమూర్తులెసఁగ, దేవ!
నీవులేక, యేవిలేవ; చరాచరా
వళులు, సర్వలోకములునులేవ ॥ 10

ఆ॥ కమలివెపలునలలవదువ్వున, దినకరు
కిరణపముఁడయములకరణి, జనులు
నీదుదేహమందునీలకంధర! సము
త్పాదితులనుగారె? పార్వతీశ! ॥ 11

ఆ॥ ఏఫలంబుఁగోరి, యీభూతజాతంబు
సృష్టిజేయుచుందువష్టమూర్తి!
నీవెగాక, యెఱుఁగరేవారుఁగాని, స
ర్వజ్ఞసంజ్ఞనీకెవఱలుఁగాన ॥ 12

ఆ॥ సర్వభూతములకు సార్వకాలికముఁ, గా
రోగ్యపకారకంబు, యుక్తియుక్త
మైనపజ్ఞత్వమైనఁ, దద్భూతముల్
హుంకరించుచుదాన, శంకలేక ॥ 13

ఆ॥ దేవ! త్వత్ప్రసన్నదృక్ప్రసారములేక
కదలఁజాలఁడయ్య! గడ్డిపోచ
యైన; నీవొసంగుదఖిలజీవులకుఁ దే
జంబు, ధృతియు, బలము శైలచాప! ॥ 14

ఆ॥ ఆటకాఁడు బొమ్మలాడించునట్టులీ
వీచరాచరాళినెల్లఁ గర్మ
సూత్రవశతనుంచి, సారివియాడింతువీ
వీశ! పాపనాశ! కృత్తివాస !! ॥ 15

ఆ॥ ఇప్పుడేల నన్ను సృష్టించితీశ! నే
నేమి సేయువాఁడ? వ్యోమకేశ !
బ్రహ్మవిష్ణులోకపాలాదులకవశ్య
మైనదాని, దెనినొనుదీర్ప?" ॥ 16

చం॥ అన, విని, శంకరుండు కరుణాంతరుఁడండఁబునాలకించప, ని
ట్లని మొ "మహానుభావుఁడు గుణాఢ్యుఁడు ముక్తమహాద్రిచంద్రుఁ డ
త్యనుపమసత్త్వుఁడీతఁడు, మదాత్మజుఁడార్యనృపాగ్రగణ్యుఁడీ
తనిని సహాయుఁగాఁబనిచెదన్ భవదాపదపాయకాంక్షినై ॥ 17

ఆ॥ ఇంద్రతుల్యవీర్యుఁడీతఁడగ్నితుల్యతే
జస్కుఁడనిలబలుఁడహస్కరప్ర
తాపుఁడద్రిధైర్యుఁడై, పాఱుద్రోలుసా
మాత్యమిత్రపుత్త్ర, మాసవాదు ॥ 18

ఆ॥ తొంటియట్లమీరలుంటకు, స్వర్గలుం
టాకు, దైత్యునొంచుటకును ముక్త
మానివలఁతియెంత మేనియుఁజుండి! యీ
నాదుమాటకల్లగాదుసుండి!" ॥ 19

ఆ॥ అనఁగ, ననఘమూర్తి, యార్యాసహాయుఁడా
దిత్యులున్, మహర్షులత్యుదాత్త
ఫణితిఁ బ్రణతిఁ జేసి, ప్రణుతియుఁ గావించి
యుంచుకంతచింత యెఱుఁగకుండ్రి ॥ 20

వ॥ ఇటులనిటలనయనునియమనయవచనములకమరవరులు హృద్య
యములనుగుదురుపఱచుకొని, తమతమనెలవులకుఁజనిరి. పిదప,
హిమగిరిదుహితృపరిబృంహితుఁడును, కరతలపరిమృదితభృశతర
నిజభుజజనితమునివరకరతలుఁడగుచు, నతనికిట్లనియె॥ 21

ఉ॥ “ఓయి, కుమార! నీదగు మృదూక్తి సుధాప్రవదుత్తమస్తుతి
ప్రాయశుభంయుభావపరిపాకమనోహరవాక్యనైపుణిన్
నాయెదతుష్టి జెందెఁ, గరుణావరలాంఛనమున్, బహూకృతిం
జేయఁదలంచి, యిచ్చెద; నజేయపరాక్రమ! స్వీకరింపుమా!”

ఆ॥ మదనిగనకమయంబును
మణిమయంబునయిన ముకుటమొకటి
కోటిసూర్యకాంతి, పాటవాభేద్యమౌ
కవచమొకటియొసఁగె శివుఁడతనికి ॥ 23

ఆ॥ మఱియుఁ, బాశుపతముఁ, గరుణించె నానాస్త్ర
శస్త్రముల్, భుజాగ్రసంభవునకు
భద్రదాత్రినిచ్చె రుద్రియగాయాత్రి
మాక్తికాఖ్యమునికుమారప్రియుండు ॥ 24

ఆ॥ ఇటులొసంగి, యన్న, నిటలాక్షుఁడనియె ని
ట్లోకుమారా! నాదువాక్యమును;
త్రిభువనావనార్థసృష్టుండవీవు నా
చేత; నీవుదానిఁ జేయవలయు ॥ 25

ఆ॥ ఈయభేద్యకవచ, మీకిరీటంబు, నీ
పాశుపతమహాస్త్ర మీశుభప్ర
దాంబులై రుద్రగాయత్రిమంత్రంబొ
సంగినాఁడనీకు సాయపడఁగ ॥ 26

ఆ॥ జానుమంతుఁడనెడుదానవుండొకఁడుగ్ర
తపమొనర్చి, యవ్విధాతవల్ల
నన్యదుర్లభంబులౌవరంబులఁగాంచి
తీవరించెఁ గంటకావరమున ॥ 27

ఆ॥ ఆవరించివానినాతేజమెల్లఁ
నెండవోలె ర్నిరీక్ష్యమై, దు
రంతచింతఁగూర్చుసంతాపకారియై
లోకములకుపాత్రలోకములకు ॥ 28

ఆ॥ యాగకర్తలకు, ననాగసులగుయోగు
లకు, మునీంద్రవర్యులకు, నమర్త్య
లకును, భూసురేంద్రులకును, స్త్రీలకు, గోవు
లకునుగీడొనర్చురక్కసుండు ॥ 29

ఆ॥ శోకచక్రవోలె, లోకములకువాఁడ
రిష్టదాయి యగుచుఁ, గష్టములను
గ్రించు, రక్కసుండుకించిత్కృపాదృష్టి
లేక, తెచ్చిపెట్టుఁగ్లేశకారి ॥ 30

ఆ॥ కాంక్ష, రక్కసుండుక్రూరత్వమునయజ్ఞ
నాశమాచరింప, నాశుమార్గ
గామివౌచు, రుద్రగాయత్రిపుష్టపా
శుపతశక్తివానినపనయింపు ॥ 31

ఆ॥ నూగరక్షణంబు నాచరించు ప్రపరస్న
హాస్రసంఖ్యనెప్పుడస్రపాయి
సైన్యముల్ భజించు జానుమంతలు; వాంఛ
వఘ్యుంషన్యశస్త్రవర్గములకు ॥ 32

ఆ॥ భద్రదాత్రిసుమ్మి! రుద్రగాయత్రి త
జ్జపము సర్వవారికెపుడు; దీని
సాటిమంత్రమేది? చాటిచెప్పెడు వేద
టంచు, నుద్భజించనై; కుమార! ॥ 33

ఆ॥ భద్రదాత్రిపుత్రి! రుద్రగాయత్రి; స
ర్వార్థసాధనము; జయప్రదంబు
సత్యమూర్ధ్వబాహుశాఖుండనై, చెప్పఁ
గలను; జయముహస్తగతముదీన ॥ 34

ఆ॥ ఎప్పుడు భక్తిదీనిజపియించునెవ్వఁ, డా
తనికిమ్రొక్కుదేవతాగణంబు
సంభవించుఁజూవె, సంభ్రమతనికి
సర్వతోముఖంబఖర్వశుభము ॥ 35

ఆ॥ ఓయి, మాని! రుద్రగాయత్రిదీని జ
పించుచోటనుండ పెట్టివ్యాధు
లెట్టిక్షామములును, గట్టిడిచోరబా
ధలు, షడీతులున్ ధుతంబులౌను ॥ 36

ఆ॥ వనమునన్, రణంబునను, శత్రుజలవహ్ని
మధ్యముననుగాని, మహాక్రీకర్త్రి !
భద్రదాత్రియైనరుద్రగాయత్రిజం
జప్యమానమైనఁజాలుఁబుత్రి ! 37

ఆ॥ త్రాణమిచ్చు గాత నిర్మలోరుమం
త్రంబు; గాన, దీనికంబవిత్రి
మై, యెసంగు సంజ్ఞ గాయత్రి నా; మంత్ర
మనఁగ, నర్థమేమొ, వినుము-పుత్త్రి! ॥ 38

ఆ॥ మననశీలి "మంత్ర" యనఁజనుఁ, ద్రాణంబు
మంతకిచ్చుఁ; గాన, మంత్రమయ్యె
నిర్మలాత్మ! వేదనిశ్చప్రచంబు, దే
వర్షి భావితంబు, హర్షణంబు ॥ 39

ఆ॥ దాహనంబుసేయు; మోహనంబును జేయు
శోషణమును జేయు; ద్వేషి వర్గ
మునకుఁ; బాశుపతము నశనంబొనర్చు న
మాత్రిఁ గా ఋభీతి శత్రుసేన ॥ 40

ఆ॥ తొల్లి నాదు భక్తులుల్లసిల్లిరి గుహ్య
శైవదీక్షఁ బొంది, శూలి! రుద్ర
జేపతాక మంత్ర దివ్యశక్తి నిసర్వ
తో జయంబుఁ గాంచి కేఁ గాన ॥ 41

కం॥ గుహ్యంబగు మంత్రంబిది
గుహ్యంబగు నస్త్రమిదియు; గుహ్యతమంబుల్
గుహ్యేతర గుహ్యములు నా
గుహ్యకములు కనునివి యగోచరములె యరా 42

వ॥ నీవు నాకు భక్తుండవును, నా భుజాగ్రంబునందుదూ్భతుండవును గావున నేనవీనినీకనుగ్రహించినాఁడ; నీవువీనింబరిగ్రహించినవాఁడ వై యూజానుమండలు, నాజానచండతాపిచండిలు, లీలామాత్రంబునం బాఱఁద్రోలి, శాలీనతాహీనతాఒదీనదీనతాశాలురైనయా

నిలిపులకింపుగింపి, తెంపరిస్తై, సాంద్రైనకీర్తిమల్లికామతల్లికా
మాలికాజాలికావాసనావాసితదశదిశాఽఽభోగశోభాయమాన
త్వంబుసంపాదింపుము॥ 43

ఆ॥ ఈవుగాక, వానినెవ్వారు సంహరిం
పంగనశక్తులౌ దుర్గశిత్తోరు
సత్త్వ! నీవు వాని, జానుమంతులుసంజం
పంగవలంతివయ్య! పరమజయ్య !! ॥ 44

ఆ॥ ఇందువల్లనిన్ను సృష్టించినాండనే
ని దుష్ట్రిహ్మా హేతువేమిలేదు
గాన, నీవుదైత్యు, జానుమంతులుజంపం
జాలుదయ్య! లేదుసందియంబు ॥ 45

ఆ॥ సర్వలోకములు నుశ్లాఘ్యుండవైతివ
నన్యసాధ్యమైనయట్టికృత్య
మే; యశస్కరంబున్నగణంబునకువత్స !
యేగుమయ్య! వేగమే, కుమార ! ॥ 46

ఆ। కాశికాశ్రిమంబుగాంచి, యచ్చటంగాశు
పతమహావ్రితంబువత్స ! సల్పు
మయ్య! యందుంగాశికర్షి, బుత్విజునింగా
స్వీకరించి, మఖముంజేయుమయ్య ! ॥ 47

ఆ॥ "విష్ణుమాయ"నాంగ, విశ్వవిశ్రుత, "నిమి
షాఽఽఖ్య", దేవి, త్వత్సహాయధురాను
జగములకునుజనని, శక్తి, తోవత్స ! సం
కల్పసిద్ధియోనుగాక, నీకు ! " ॥ 48

ఆ॥ హా క్తికర్షి! వారుమద్బాహుజాతులౌ
కారణమునఁ జేసి, గౌరవంబుఁ
బడయఁగలరు పుడమి బాహుజక్షత్రియా
హ్వయము, విస్మయాఢ్యమస్మయులయి॥ 55

ఆ॥ వేదపుణ్యమార్గచోదితంబగుధర్మ
వే, వినయమానమై, విశిష్ట
త్రైవనీదువంశ్యక్షత్రియులకెల్ల
గరునుగా వ్యాపారము ప్రకటితముగ॥ 56

ఆ॥ విశ్వవిశ్రుతులయి, వేదోక్తమార్గాను
యాయులౌచు, జాతమాదకర్మ
జాతమెల్ల వేదసరణి యథాయోగ్య
కాలమాచరింపఁగలరు వారు॥ 57

ఆ॥ జిహ్మవృత్తిలేక, బ్రాహ్మణదేవతల్
గాఁగలారు; ధర్మగాములౌచు;
శ్రితవిశిష్టమార్గసుప్రవిష్టులు, విశి
ష్టులుఁ జతుర్వ్యాన్ విశుద్ధులౌచు॥ 58

ఆ॥ వేదమార్గచరులు, వేదశాస్త్రికని
రతులు, దేవపితృనిరంతరార్చ
నాదికములఁ, దర్పణాదికములబుషీ
శ్వరులఁదన్పుచుందు రిత్వత్కుజులు ॥ 59

ఆ॥ హరిహరాహ్వయద్వయాద్వైతసద్భావు
లై, భవచ్ఛభావ్యయప్రసిద్ధు
లెల్ల, సజ్జనుల్ సముల్లసద్ధర్మత
త్పరులు, మఱియు శ్లాఘ్యవర్తనులును ॥ 60

ఆ॥ బ్రాహ్మణుండు నీదు వంశీయులకు దైవ
మౌనుగాక! కర్మ వ్యర్థమౌను;
బ్రాహ్మణుండు లేక, ప్రతిపాదితం బైన
యద్దియెల్ల మాక్తికాఖ్యమౌని!॥ 61

ఆ॥ వైదికముల కెల్ల వేదాక్షరాళికి
వక్త, ప్రేరకుండు బ్రాహ్మణుండు
నాడు సృష్టి బ్రాహ్మణక్షత్రియులు, వైశ్య
శూద్రులెసంగ, వారు క్షోణియందు ॥ 62

ఆ॥ అగ్నిమౌను వైదికాచారమాధ్యత్రి
యంబునకును మాక్తికాఖ్యమౌని!
శూద్ర వైశ్య బాహుజులు, బ్రాహ్మణులుత్త
రోత్తరుల్ వరీయులాత్మపుణ్య!!॥ 63

వ॥ బ్రాహ్మణునఁ బూజించి యోసుమీ — వైదికకృత్యంబులుపక్రమింపం జెల్లు; విప్రులంగళ్లిల కీర్తనంబును, వాక్పారుష్యంబును బ్రవర్తింపంబోలదు; పురోహితు నతిలంఘింపరాదు; త్రిశంకునకుం బ్లపత్వంబు ప్రాపించుట పురోహితు నతిక్రమించిన దోషంబు చేతనే కదా! యశక్తుండను, రిక్తుండను, విద్యాశూన్యుండను, గలితేంద్రియుండునైనను, బ్రాహ్మణు నవమానింపరాదు. బ్రాహ్మణుండు ప్రామాదికంబగు ధర్మభ్రంశంబునకుం బూనుకొన్నను, తద్ధర్మభ్రంశంబన్యులకు ఘాటనీయంబు గాదు సుమీ. యట్టులు ఘాటించువాఁడు ధర్మచ్యుతుండు గాఁగలండు॥ 64

ఆ॥ వత్స! ధర్మమిది శ్యావ్యంశ్యులకు సనా
తనము సూ! పురోహితప్రదిష్ట
మార్గమునను గృత్యవర్గంబు నాచరిం
చుట మహామహా! విశుద్ధసత్వ!!॥ 65

వ॥ మఱియు, గర్భాధానంబును, సీమంతోన్నయనంబును, పుంస[వ]నంబును, అన్నప్రాశనంబును, చౌలంబును గాయత్రీగ్రహణంబును, ప్రాజాపత్యసౌమ్యాగ్నేయ వైశ్వదేవాఖ్యంబులైన వేదవ్రతంబులు నాల్గును స్నానంబు, నుద్వాహంబు, నౌర్ధ్వదైహికంబునను నీ శౌనకసంప్రోక్తంబులు శ్రౌతస్మార్త విమిశ్రితంబులై, త్వద్వంశీయుల కెల్లరకును క్షత్త్రియకులోక్త ప్రకారంబున నాచరణీయంబులౌను వైదికకృత్యంబులు ఋషిగోత్రాంక పూర్వకంబుగాఁ జేయందగు గోత్రకర్తలైన పరాశరుండును శాండిల్యుండును గౌతముండును గౌండిన్యుండును గుత్సుండును భార్గవాదులును ద్వాత్రింశత్కులంబునకుం బురోహితులౌదురు 66

ఆ॥ క్షత్త్రియెల్లఁ దొల్లి చంద్రసూర్యసముద్భ
వంబు; ధర్మరక్షణంబు; తత్ప్ర
వృత్తి యుర్వియల్లె పృథివి ముద్భజోద్భూత
మార్యసంజ్ఞ, క్షత్త్రియమానమాని!॥ 67

ఆ॥ సాధుశీల! యద్విధైధమాచారసం
శుద్ధయౌచు, ధర్మబద్ధయౌచు
వఱలు మండునుర్విఁ ద్వద్వంశయౌన్నత్య
మెందునెల్లకాలమో మహాత్మ!॥ 68

ఆ॥ శస్త్రధారణంబు, సజ్జనావనదుర్జ
నప్రణాశవితరణములు, సుజన
దానధర్మములు, శ్రుతంబు త్వద్వంశమం
దొప్పునిల్చునో మునీంద్ర! నిజము॥ 69

ఆ॥ ఎప్పుడుగలుగకుండు నృపులకు మానసం
త్యాగభైక్ష్యజీవనంబులుర్వి
శౌర్యమునను, బాహువీర్యంబునను క్షత్త్రి
యులకు జీవనంబుగలుగుఁ గాత!॥ 70

ఆ॥ శిల్పములను, వివిధచిత్రంబులరచించి,
ధరణీధవ్రులమెప్పుఁదద్దఁగాంచి,
గౌరవార్హులై, యపారసౌఖ్యంబులొం
దుదురు; నిజము,పెక్కునుడువులేల?॥ 71

ఆ। మత్ప్రసాదజనితముత్ప్రకర్షాఢ్యమా
ర్యావనీశ్వరాన్వయంబు, సర్వ
రాజలోకమందిరస్కరించుమహత్త;
నుత్తమోత్తమంబు, సూపపదము॥ 72

ఆ॥ సూర్యచంద్రవంశ్యసుక్షత్రియులుసైత
మాత్మరాజ్యదూరులై, కలిప్ర
భావమునను, ధర్మబాహ్యులై, యూరఁబే
రునునశింపనుండిరనుటయెల్లు?॥ 73

ఆ॥ ద్వ ద్వదూర! యీభవద్వంశ్యులుపురోహి
తానుయాయులై, మహానుభావు
లౌచు, జాతకర్మలందు నిష్ఠితులై, వి
పత్తులందునైనఁబాయరెందు॥ 74

ఆ॥ వేదవిహితకర్మలాదటఁజేయుచు,
వఱలుచుందురిదియవరమునీకుఁ
చిత్రకర్మలందు, శిల్పంబులందుఁద్వ
ద్వంశ్యులధికకృతుల్ సదా,జగాన॥ 75

ఆ॥ పోంచఁగలరువారుపూర్వత్వమవరజా
టులను; యజ్ఞశాలికలఁజపాల
కాద్యులూఖలాదియజ్ఞోపకరణంబు
లెల్లఁజేయుచున్,మనోబ్రిథితులు॥ 76

ఆ॥ వారొనర్చు విగ్రహారాధ్యులై కొల్చి
దేవతల్ ప్రసన్నతావిభూతిఁ
బొల్తు, రెంతయేని ముక్తర్షి! తద్వంశ్యు
లెల్ల మౌక్తికాఖ్యులే యగుదురు॥ 77

ఆ॥ మద్భుజాగ్రజాగ్రదుద్భాతిఁ గాంచి, యూ
ర్వ్యాఖ్యులైన క్షత్త్రియాన్వవాయు
లెల్ల చిత్రకర్మనుల్లసిల్లుటఁ జిత్ర
కారులౌదురో వికారదూర!॥ 78

వ॥ వా రెల్లరును, వేదోక్తాచారాదూరులును, బ్రాహ్మణభక్తి
యుక్తులును, ఋషిగోత్రప్రవర్తకులును, సౌందర్యనిర్జితకందర్పులునై
ప్రవర్తిల్లుదురు. నీవును, మత్ప్రసాదాసాదిత పాశుపతదీక్షాదక్షుం
డవై పాశుపతాఖ్యంబైన దివ్యాస్త్రంబును బొంది, తన్మహాశక్తిం జేసి
జానుమంతునంతె మొందించి, తన్మూలకంబైన యశోవైభవంబున
శ్లాఘనీయుండవై నీవు మనయిరువుర సంవాదంబియ్యది యైహికా
ముష్మికఫలప్రదంబు శ్రద్ధాళురై, దీని విన్నవారు సంభ్రమంబు
నొంది, సర్వాభీష్టలాభంబులు గాంతురు. మద్వచనమ్ము నమ్ము
మని, పరమశివుఁ డానతిచ్చెన॥ 79

చం॥ నిజహృదయమ్మునందితఁ డనిందితవర్తనుఁడైన మౌక్తికా
ఖ్యజపిత్రముఖ్యుఁ డెంతయు నహర్షముఁ బొంది, స్వకీయపుణ్యకం
శజుభవిష్యదభ్యుదయసంశ్రవణమ్మున భక్తినైవఁ బ్రస
ధ్వజునకుఁ బార్వతీహృదయవర్తికొనర్చె నమస్సహస్రముల్॥ 80

వ॥ అని, తెలిపిన, విని యవ్వలివృత్తాంతంబెట్టిదని, వీణాపాణివాణీ
జానినడుగుటయును. 81

ఆ॥ సిరులుమించుచేన సరులు పెన్గాలిచే
పరులు,బూదిపూఁతవటులునంగ
రాగమెన్న,ఱాఁగ నూగంగసిగదంష్ట
కరమునమరునీకుఁగపిలమల్ల!॥ 32

ఇది, ఆంధ్రీకృతము క్రీశ్వరోపాఖ్యానంబునందు, సూక్తికవుల ధర్మనిరూపణంబను షష్ఠాధ్యాయము.

శ్రీరస్తు

# ఆంధ్రీకృతము క్రీశ్వరోపాఖ్యానము

## సప్తమాధ్యాయము

ఆ॥ నిరులకునికియయిన నరసాపురమ్మున
వెలసి,లసితశుభవములనుబడసి,
బలసికొలుచుభక్తవరులకోర్కెలుదీర్చు
కపిలమల్ల! రిపువికాయభిల్ల!॥ 1

ఆ॥ అఘధరింపుమనలిఁగుకథ సురముని
నలువకనియె"వినఁగఁగవలఁతు; విస్త
రంబుగాఁగ,సర్వమంబురుహాసనా
సీన! యీకథావిశేషమేను॥ 2

కం॥ సెలవీయవె"యని, నారదుఁ
డిటు మినుడుగఁ,బలుకఁదొడఁగెనీకతినజుం
"పలఘుమహిమాన్వితంబును,
లలితఁబిది; వినిన, బహుఫలప్రద"మనుచున్ 3

వ|| అత్తెఱంగున నమ్మహర్షి ముక్కంటిం జూచి, యిట్లనియె—"దేవా!
తావకీనసేవకుండ నైన నాకుం గర్తవ్యంబు సర్వంబు నాజ్ఞాపింపుము
సర్వకార్యంబులు, సర్వమార్గంబులును వ్యక్తసిద్ధిఁ గాంచువాఁడ;
నేను జక్కం జేయంగల దేవతాకార్యం బెద్దియో సెలవీయవే"
యని, యడిగిన, నతని కిమ్మృడానీవల్లభుం డిట్లనియె॥ 4

ఆ|| "ముక్తహాని! సర్వముక్తంబు కర్తవ్య
మీపుధ్యానశక్తి భావితత్త్వ
మెల్ల నెఱిఁగితిప్పు డెల్ల హానీందుగ్రిల
తోఁ దపోవనస్థితుండ వౌచు॥

ఆ|| వత్స! సత్యవాది, బ్రహ్మర్షి కౌశికుం
డాచరించినట్టు లాచరింపు
వ్రతము నిష్టపంబుఁ బాశుపతాభిధా
నంబు; దాననే జయంబు నీకు॥ 6

ఆ|| నిగమనిగదితంబ యగువిధిఁ గౌశిక
మతము, సర్వసిద్ధమతముఁ దప్ప
కగ్నిహోత్రమందు హవ్యముల్ వేల్వ, నం
దుద్భవించు వత్స! యద్భుతముగ॥ 7

ఆ|| తప్తకాంచనాభముత్తరత్నంబు స్యం
దనము మేటితుల్యమన, నభేద్య
కవచ మొండు రత్నకాంతికాంతము, శ్వేత
వాహముల్, మనోజవంబు లార్య!॥ 8

ఆ|| దృఢము ధనువుఁ గాడివి, దీర్ఘతగల్గి, య
క్షయ్యబాణతూణ హస్త్రరాజ
నపాశుపతము, నన్యాయుధంబులు
జయములును, శత్రుభయదము లను॥ 9

ఆ॥ వత్స! స్వీకరించితత్త్వధనమ్ముల
నీవుజానుమంతుఁజావమోది,
యుద్ధభూమిసర్వసిద్ధులన్ బొందెద
వరుగుమనఘ! కాశికాశ్రమంబు॥" 10

వ॥ అనిన, మృడునకు మునిపతి వినయవినమితుండయి, యిట్లనియె- "దేవా! నీవు రాజనకుండవు; కారణకారణుండవైననీవునన్నుం గాశికాశ్రమంబున కేగుపొంటె నకారణంబుగాఁ బల్కుదువని యెట్లు భావింతుఁ? దత్త్వానంబునకుమత్ప్రస్థానవిధానంబునుమత్కర్తవ్యంబును నాకుబోధింపవే" యని, మఱియు, "నాకుఁ బ్రభూ! భవత్సంకల్పమాత్రంబునం జేసియే, కృత్స్నంబైనయసాధ్యకృత్యంబుసాధ్యంబుగాదె! యట్టిచో, నగ్నికార్యంబేనేలతీర్పఁగావలయుఁ? దత్త్వజిజ్ఞాసమానుండనైన యీనాపరిజల్పితంబునకుమన్నించియజ్ఞుండనైన నన్నుంగృతార్థుంగాఁ జేయఁగారుణికత్వంబునం జేసి, నాకుంబ్రతివచనంబనుగ్రహింపవే" యని ప్రార్థించుటయు నిటలనయనుండును క్షణంబుధ్యాననిశ్చలుండైముక్తమునీంద్రునితో సవిమర్శంబుగా నిట్లనియె ॥ 11

ఆ॥ "వత్స! తెల్పువాఁడఁ దత్సర్వమును గోప్య
మైనదానితత్త్వమేనను గ్ర
హింపసర్వసిద్ధులిట్టిసంకల్పమా
త్రానఁగల్గు; సత్యమైనఁ గాని॥ 12

ఆ॥ కల్పనమ్మెనర్తుఁగార్యకారణబంధ
మేన; దాహశక్తియెల్లనగ్ని
యందు; వృక్షజన్మమల్లబీజమునన్; క్షు
ధాఽపనుత్తియన్నమందుఁ; దూప ॥ 13

ఆ॥ అపుడు గుసుదకమునను; బుడుతలుబుషమిపైఁ
బడుదురయ్య! యమ్మ పరిభవకరణ
మిలను; బంటవానవలనఁ; గాలుఁ జెట్టుల
ల్లాడుచుండుఁ; గారణాళియిట్లు॥ 14

ఆ॥ సర్వకార్యములకుసంకల్పమన్నది
యమ్ము ముఖ్యకారణమ్ము వత్స
యదియుఁ గానరాక, యంతయుఁ జేయు; నిం
తైనఁ, దెలియఁడహహా! యజ్ఞుఁడిద్ది॥ 15

ఆ॥ నీదుపుట్టువునకు నాదుసంకల్పమే
కారణంబు వత్స! కోఁడ గొరడు;
శీఘ్రగామివై, విచిత్రంబుగా సాధు
కార్యమాచరించి, క్రమమ్మరంగ॥ 16

ఆ॥ దితిజవరునిఁ జంపది వ్యాస్త్రలాభంబు,
నొంది, నీవు త్రిజగములో హాయనఁగఁ
బొగడఁగనఁగ, నార్యభూమీశవంశక
ర్తృత్వలబ్ధభాగ్యరేఖఁ గాంచు॥ 17

ఆ॥ కాదు–కాదు; వత్స! నాదుబోధన కన్య
థాత్వసిద్ధిఁ గోరుతలఁపుగాదు
"దుష్టశిక్షణంబు, శిష్టరక్షణము నె
ట్లానో" యంచు, నెంతు నేనుమదిని॥ 18

వ॥ నిన్ను త్పాదింపక, నేన మాజానుమంతలాభిధానయాతుధాను
సంహారించితినేని, లోకంబునంగిర్తినీకుం బ్రాపించు టెట్లు? మత్సం
కల్పసంభవంబైన చారిత్రంబునాకర్ణించి, యెల్లరు దుఃఖసంతా
రణంబుఁ గాంచి, సంపత్సంతానంబునొందుదురు. సూక్ష్మదృష్టిక

గల్గినమనోదృఢత్వశాలులకుంగాని, యీపరమరహస్యంబు గోచరంబుగాదు. మదాజ్ఞావర్తివైన మహర్షీ! నీవుశీఘ్రంబుగాంబోయి మదాదేశంబు వర్తింపు" మని నవిని మహాకార్తికమహానీశ్వరుండును

ఆ|| "ధన్యుఁ జేసె నన్నుఁ బావకాదేశ" మం
చతులనుతులనతులనాచరించి,
యరిగెఁ గాశికాశ్రీ భోగమాశ్రమం
బనుపమానశక్తి, ముక్తమౌని|| 20

శా|| ఏలాజాతిలవంగపూగమరిచాహింతాంబరౌదుంబర
శ్రీశాలిత్వముహుర్వివృజృంభిమధులిడ్బృందోరుగానంబు, తాం
బూలీపాటలనాగకేసరలసత్పున్నాగసౌభాగ్యలీ
లాలాస్యాఢ్యము, నిత్యశోభనము, ఖేలత్ఖేచరీసేవ్యమున్|| 21

శా|| శుంభన్మత్తమతంగజప్రకటితస్ఫూర్జత్సముత్సాహమున్,
జృంభారంభవిశాలసృక్వయుగసందృష్టోగ్రదంష్ట్రాంకురో
త్తంభత్తీవ్రనఖాగ్రనిర్దళితవేదండోరుకుంభస్థలీ
గంభీరోత్పతనోద్యమానుభవదీక్షాదూరహర్యక్షమున్|| 22

మ|| పవమానప్లవమానమానితదరఝరాంభశ్ఛటాళీతానోకహా
ప్రవిశుద్ధద్రుమమూలశోభితము, విభ్రాజన్నదీమాతృక
త్వవిశాలాఖిలసస్యశస్యధరణీధారేయతాంకారాధితం
బవిశంకప్రతిభాప్రభావము, నపేతాతంకనిష్పంకమున్|| 23

మ|| నవధూమావళిసంవృతద్రుమమహాశాఖోపశాఖంబు,మా
నివరేణ్యాచరితాఖిలోపచరణాంతేవాసిపాపత్యమా
నవిగాయే శంసామసంశ్రవణసానందాగతాగంతుకం
బవిసోఢాదిమహావిరోధబహువన్యాభీలతాశూన్యమున్ 24

ఆ॥ సన్నికృష్టశుభము, భిన్నదర్భాంకుర
స్థానసంచరత్సుతర్ణకంబు;
నతిశతబ్రసీసమాసీనమౌనిరా
డ్జపతపోవిశేషవిపులతరము ॥ 25

వ॥ మఱియును, కుశాసనపరిక్షిప్తసైకతాంతజలాశయంబును, దపస్య
ద్భర్తృశుశ్రూషాసజ్జన్మునిపురంధ్రికంబును, బశ్యజ్జనసర్వతో
ముఖహృచ్ఛాంతిసంధాయకంబును బుణ్యాగణ్యమాహాత్మ్యంబును
నశుభశమనంబును, నగున య్యాశ్రమంబును దర్శించి, యమహా
క్షేత్రమహానిందు నిండు వెండియుండన యంటవసిష్ఠవామదేవకౌండిన్య
శాండిల్యగాలవభృగుకశ్యపజైమినిభరద్వాజాత్రిధౌమ్యగర్గమృక
రోనుశకణ్వగౌతమకపిలపులహమ్రుశుతకీర్తిశ్రుతిధరలోమశచ్యవన
భార్గవవిశ్వామిత్రకణ్వసనకలవింకపరాశరగార్గ్యమార్గంగాత్రేయ
శ్రీవత్సప్రభాతభరతచిత్రకపులస్త్యాగస్త్యమార్కండేయసుత్రశుసుపర్ణ
మాగధిబకదాల్భ్యకుత్సనారదమాండవ్యపింగళకపిలశుభ్రకీర్తి
సుమందసుధర్మసోముండకిందమప్రస్కణ్వఋశ్యశృంగపారా
శర్యవాలఖిల్యచిత్రోగ్రసేనజాబాలియాజ్ఞవల్క్యమండపావరజీవన
గోపకగోపగోకులాదులైన మహామునీంద్రులు, వేదవేదాంగవేత్తలును
సత్కర్మకర్మఠులును, సత్యవ్రతపరాయణులును, బ్రహ్మజ్ఞులును
బ్రాహ్మణప్రజ్ఞులును జపతపోనుష్ఠాననిష్ఠాగరిష్ఠులునై నవారెంద
ఱెందఱేని బలసికొలువందదాశ్రమంబున శ్రమంబునం బ్రవేశించి॥

ఆ॥ యోగివర్యుఁ డంత, యాగదీక్షాదక్షుఁ
డౌచు, విశ్వకర్మ నంతరంగ
మందుఁ దలఁచుకొన్న, నాతండు సాక్షాత్క
రించి, యంతవిన్నవించె నిట్లు ॥ 27

కం॥ "ఓ నఘ! ననునీవుదలంచిన
క్షణమున భవదీయ దివ్యసన్నిధిన్ బె
ల్చిన లిచ్చినవాఁడ; మహా
మునివర! నీవల్ల లోకములు మేలొందున్ ॥ 28

కం॥ నిను నెఱుఁగుదు; మునుగౌరీ
శునిభుజమునం బోషిమి, రక్కసులనుఱు మూషం
గను, ఘనయశమునుగనుదని,
యనిమిషులనుదనిపి, తనియుదని యుమహాత్మా! ॥ 29

ఆ॥ నిర్గ్లయించు పుణ్యదినేజేయఁగల్గున
కార్యమార్య' మౌనివర్య" యంచు
విశ్వకర్మ విన్నవింప, ముక్తకష్టరియు
ట్లని యెనాంఁరమున నతనితోడ ॥ 30

వ॥ మహాభాగా! నీకు స్వాగతంబు. మేమీ శాను శాసనంబునన్ దప్పి రితిమై పాశుపతవ్రతంబాచరింపుచున్నవారము. వ్రతానంత రంబు నందత్యాసిద్ధుత్వార్థంబగు నొక్క జన్నంబొనర్పఁగావలయుం; గావున, నీవు గంగా స్రోతోత్తరంబునందొక్క యాగశాలను రమ్యాతిరమ్యంబైనదాని వేవేల్పడినిర్మించి, యీవలయు. వేద వేదాంగపారంగతులైన మానీంద్రులందీవ్రతదీక్షంబూర్తిగా నిర్వర్తింతు" మనివినిని యనంతరంబు । 31

మ॥ పరమార్థజ్ఞుండు, విశ్వకర్మయు, మహాప్రాజ్ఞుండు, స్వర్గాపగాం తరపుర్వస్థలి యాగశాలనుపమూత్నంబున్, మణిస్తంభగో పుర వేదీశుభ హేమభిత్తికలితంబున్, రత్నసంస్తీర్ణమం దింగాసత్మతతోరణాన్వితము, విస్తీర్ణంబు నిర్మించినన్ ॥ 32

చం|| అదియును, రత్నకంబళశతాంచితమున్, గమనీయపద్మరా
గదివసకల్పితాప్రతిమగాఢరుచిప్రతతిప్రకీర్ణశుం
భదమలహోమకుండలసమానము, ముక్తమహర్షిహర్షసం
పదవధిగాఁగనంబడెశుభప్రదమై, సుమనఃప్రియంబునై || ౩౩

ఆ|| అట్లువిశ్వకర్మ యాగమందిరము ని
ర్మించి, ప్రశ్రయంబుమించి, యించు
వేడ్క నిట్లువిన్నవించె ముక్తర్షికి
రంజలించి, భక్తినమనశిల్పి || ౩౪

ఆ|| "యాగశాలలోన వేగఁ బ్రవేశించి
యాచరింపుమార్య! యాగతంత్ర
మహహా! లోకపూతమగుఁగాదె, నీజన్మ!
నీదుకృత్యమట్లె నీప్రవృత్తి || ౩౫

వ|| మహాత్మా! నీవులోకక్షేమార్థంబత్యర్థప్రవృత్తుండవైనంతనే, మాబోంట్లాచరించు యైహ్యకార్యంబులుకూడ, లోకకళ్యాణభాజనంబులౌనుగాదె! మహాత్మా! యీమందిరంబునకిదిగో వరణంబు. ఇదికుడ్యంబు. ఇదిస్నానమండపంబు. ఇదిప్రప. ఇది హోమస్థానంబు. సర్వసంభారసంపత్సంపాదనశుభదారంభసంభాసమానంబై, యసమానంబై, యసమానంబైనదీనిన్ బ్రవేశింపు" మనుచు, సమర్పించిన, నతండునుదానినట్టెస్వీకరించె; నంత, విశ్వకర్మయు, "నార్యా! నేనింకనునేమిసేయంగలవాఁడ? నాకానతీయవే" యనునాతని చూచి యుసి వేడుకోలును వెనుదీయక యామహాలిక మౌనీంద్రుండమ్మహాశిల్పికిట్లనియె- "నాచార్యా! యియాగమందిరంబత్యంతమనోహరంబును, సర్వకృత్యానుకూలంబునౌను; నీవిద్దానినర్ధక్షణమాత్రంబుననిర్మించియిచ్చుట

యనన్యసామాన్యంబు; సికేయయ్యది సెల్లె. దీనిఁజూచిన
యెవ్వనికేనిగాని నీయీనిర్మాణకర్మరత్వ చమత్కారంబులు
మెచ్చుఁగూర్పకుండునే? యేనత్యంతసంతుష్టాంతరంగుండనైతి.
మెఱమెచ్చుగాకయియిచ్చ్మకంబుఁ జెప్పక బుచ్చికంబ చరించితి నను
కొంటివో? ఇంక నాకేమియువలదు. నీవింకయథేచ్ఛంజను"
మనిన, నమ్మహర్షికి విశ్వకర్మ యిట్లనియె ॥ 36

మ॥ "మహితాత్మా! విను; లేదు లేశమయినన్, మత్కౌశలంబిందు ధూ
ర్వహమయ్యెన్ భవదాజ్ఞయున్, గిరివరాపత్యప్రభూత్థప్రభూ
తహితాపాదికటాక్షవీక్షణమహత్త్వప్రాప్తియున్, దీని ని
ర్వహణంబున్ బహుభంగులంగడపెంపుంభచ్చెఁభుభక్త్యున్నతా!"

కం॥ అని పలికి, విశ్వకర్మయుఁ దనునికిఁ జేరెను కృతపత్రాంవరుఁడా
తని నవ్విని యజ్ఞీయంబును సంభారోత్కరంబు మునిముస్మరించెన్ ॥

కం॥ తాఁచినతతియజ్ఞీయంబులు సంభారంబులంత, ముక్తస్థితిమున్
గలరాశీభూతములై, కలిగించె ముదంబు పారికాంక్షికిమిన్ ॥ 39

వ॥ అప్పుడప్పుడమినచ్యుతనికరుణకలిమి గోక్షీరధేనుదధ్యాజ్యాది
కంబులత్యధికంబులు, విమలతమంబులు, సుగంధగంధిలంబులునై
యామోదంబుఁగూర్పయవప్రియంగుశ్యామాకతిలసర్షపముద్గాది
ధాన్యంబులు పోగువులై, మేలుసూప, బదరీపనసామ్రనారికేళ
ఖర్జూరక్రోవిదారాది బహువిధఫలంబు లతఁడుగంబుసంబువిడఁబింపఁ
గుంకుమహరిద్రాచూర్ణాదికంబులైన శోభనద్రవ్యాంబులుమంగళ
సూచకంబులుగాఁగ, సుస్రుక్స్రువాదిపాత్రంబులు నేత్రపర్వంబులై
యొప్ప, రసాలనారికేళాదిపత్రాగ్రిజాగ్రత్పల్లవజాలంబు లుల్లం
బులకుల్లాసంబుపల్లవింపఁజేయ, నయ్యాగిందునిమాగమంది
రంబుశోభాభాసమానంబై, యసమానంబై, సర్వసుపర్వసంతోష
సంధాయకంబయ్యె — నయ్యెడ ॥ 40

చం॥ ఒకక్షణమాత్ర, యజ్ఞకరణోత్కరమయ్యెనఁగానుపింప, హా
ర్తికమునిముఖ్యుఁడున్ మునులుదృష్టకువెక్కసమైనవాని జూ
చి, "కడుమహాద్భుతం" బనుచు, స్మేరముఖాంబుజులైన నంతవా
రికినిజదర్శనంబొసఁగెఁబృథ్విఁజరించుచు, "వామదేవుఁడన్"

కం॥ పుణ్యక్షేత్రదిదృక్షాగణ్యమహాత్మ్యాతిలోకగౌరవభాక్స్వా
త్మౌత్యక్తస్వతపస్యారణ్యార్థాగుణ్యపమనై జబాహ్రమ్యముల్గొప్పన్

ఉ॥ వచ్చినవామదేవుఁడను, బర్యటనంబునఁబుణ్యభూములం
దిచ్చనిరీక్షఁజేయుచు, మహీవలయంబునలంకరించు వి
ద్వచ్ఛ్రయమున్ భవాదృశులదర్శనభాగ్యముఁబొందుచుండి, తా
నిచ్చటికేగుదెంచినటులేర్తెఱఁజెప్పెనుమార్తికర్షిభోన్ ॥ 43

ఆ॥ "నిన్నుఁజూడఁగంటి నిర్మలాత్మకుఁ; గృతార్థుఁ
డను; మహాత్మ నీవు ననుఁబ్రియాతి
థిత్వమిచ్చి, లెస్సత్మంపుఁగావించితే
నప్పుమెచ్చవచ్చెనయ్య! నిన్ను ॥ 44

కం॥ పర్యటనకార్యమునసాకార్యా! యీనాఁట నుండియభ్యవహారం
బారోచితము పాప్యమునర్యత్రోపేక్షితసూర్యా! 45

కం॥ అన్నంబునాకిడంగా, నిన్ను నుతించుచును, ధారుణీపర్యటనం
బున్నతిఁజెంగావించెద; సన్నుతమౌనన్నదానముత్పుణ్యంబున్ ॥ 46

ఆ॥ స్వర్ణరత్నవస్త్రసర్వధాన్యప్రదాన ప్రభూతపుణ్యదీప్రమైన
కీర్తికంటెహెచ్చుకీర్తిఁబాపించునీ; కన్నదాతకెన్న హాని లేదు॥ 47

ఆ॥ అన్ని దానములకు నన్నదానము పెద్ద, యన్ని దానమొంచియన్నదాన
మెన్నఁజేయుమన్న! యన్నము క్షుద్ధి సాగంతు వామదేవు గావించి॥

ఆ॥ క్షణములోన స్వాదుసాధుపధ్యాజ్యముల్గాన్న యుసాన్నమన్నగౌళ
మన్నసూపశాకకోన్నతరసులుసృష్టిసేసి ముక్తబుషివరుఁడు॥ 49

ఆ॥ "వామదేవ! తులితవామదేవ! మహాత్మ!
యారగింపు మీశ్వరాత్మములను
భక్ష్యభోజ్యలేహ్యపానీయచోష్యంబు
లైనయీమహాపదార్థములను॥ 50

ఆ॥ స్వేచ్ఛ మనస్సంతుష్టియు
తుచ్ఛాంతియ కాదు; శంభుశుంభత్కారు
ణ్యేచ్ఛ వివిచ్ఛాయైన
స్తుచ్ఛేత్సేకంబుగల్గుఁజూ! భక్షింపన్॥" 51

వ॥ అని,సవినయంబుగావిన్నవించునముక్తనామకహానీంద్రునివాక్యం
బులాకర్ణించి, యవ్వామదేవమానిమాళియు, నాపదార్థంబు
లన్నియునాపోవ, నాపోఽశనంబెత్తుటయాలస్యంబుగా నాహ
రించి, సంప్రీతచేతస్కుండై, యిట్లనియె॥ 52

కం॥ " మునికులతిలకా! సంతృ
ప్తినిజెందెమనంబు; నీవ త్రిభువనసంర
క్షణమొనరింపవలంతివి;
ఘనతవహించితివిసూ! జగంబులమిగులన్॥" 3

ఆ॥ అనఁగ, మానియుత్తరాపోఽశనంబిచ్చి,
వామదేవునకునుబాణిపాద
శౌచవారిఁగూర్చి; స్వయముగానంతనా
చాంతుఁడైనఁజూచి, శాంతిశాలి॥ 54

వ॥ ఉన్నతాగ్ర్యాసనాసీనుంగావించి,కోమలంబులైనపూగఫలంబులతో
మెత్తమెత్తనితెలనాకుమడుపులు, మంచిముత్తెంబులసన్నసున్నం
బుఁగూర్చి, యందీయ;నాసందీసుఖోపవిష్టుండైనవామదేవుండు
తాంబూలచర్వణంబుఁగావించి, యిష్టగోష్ఠీసల్లాపంబులన్ గొంత
పొద్దుపుచ్చి; ముక్తర్షిచేననుజ్ఞాతుండై,యథేచ్ఛన్ జనియె॥ 55

మ॥ ఇటులామౌనిసనంగ, మౌక్తిక మహాక్షౌండాద్రిదరశ్రీల, ది
క్తటులందెల్లగువామదేవువటఁసన్ జొమాస్థమైవినచ్చ; సా
జటివర్యుల్ సకుటుంబులై, జనఘనాశ్చర్యంబుగావచ్చి, ము
చ్చటమీఱన్ గుముల్ భుజించిరియథేచ్ఛాభోగులై, యచ్చటన్

ఆ॥ భక్తియుక్తుఁడౌచు, ముక్తీశ్వరినిత్యసం
తర్పణముల, దీప్త్యహర్పతులను
యతులనెందఱేనిఁగుతుకాన్వితులఁజేయ,
సంతసించి, వారుసాగిరచ్చ॥ 57

ఉ॥ పోయినపోకలంగుశికపుత్రుని యాశ్రమసీమఁజేరి, స
ద్గేయులు, మౌనిపుంగవులు దీక్షసమంతతఆహుతిక్రియల్,
గాయనభూమగానములు, "స్వాదత-మోదత!" యన్ వచోవిశే
షాయతకంఠమిశ్రచతురాగమపాఠములున్ వినంబడన్॥ 53

శా॥ గాధేయాశ్రమసీమ, మౌనులుస్వమార్గశ్రాంతివాయంగ, నెం
తే, ధృత్యున్నతిఁబొందిరంతట, మహాక్షౌండుఁడు, గాధేయుఁడున్
గాథానాభ్యంతరుఁడాత్తదీక్షుఁడయి, యజ్ఞంబొందుగావించి, ని
త్యైధుండై, సహధర్మచారిణియుఁబార్వత్యసీనయైయుండఁగన్

ఉ॥ ఐదవనాఁడుతాసుతలయంటుక, కౌశికుఁడున్, స్వపత్నియ
య్యైదువరాలునూతనశుభాంబరముల్ ధరియించి, యర్ధచం
ద్రోదయశోభఁగేరునిటలోపరి, గంధయుతాక్షతాళితా
రాఽఽదరణీయదీక్షితనిహావళిఁదాల్చి, మనోముదంబునన్॥ 60

మ॥ మణిభిత్తిప్రచురంబు; స్వర్ణమయరమ్యస్తంభభా[సం]భాసురం
బును, రత్నోజ్జ్వలమంటపాంతరమునన్ ముగ్గుల్ విచిత్రంబులై,
కనరా, గోమయగోముఖంబులను, రంగత్పంచవర్ణాంచితా
భినుతాష్టచ్ఛదపద్మశోభితము సంప్రీతాత్ములై, [లా]యాల్మగల్

ఆ॥ హోమకుండమునను నొప్పుగాఁ బశ్చిమ
భాగమందు రత్నభాసురంబు
హేమపీఠమొండు శ్రీమించ నిల్పి సూ
త్నంబు శుభవస్త్రమింపుఁ గూర్చి ॥ 62

ఆ॥ ఆస్తరించి, యుత్తరాగ్రంబుగాఁ గ, సా
ష్టాంగమెఱఁగి వినుతులాచరించి,
సంసదాస్థితర్షి జనము నకంత, వా
రానతీయఁ, గౌశికాఖ్యమౌని ॥ 63

ఆ॥ శుభ్రముఁ గోరుచుండి రుభయపార్శ్వస్థులై,
మునులు కాశ్యపాదిపుణ్యనాము;
లట్టి బ్రహ్మవాదు లంగీకరింపఁ బు
ణ్యాహమాచరించె నామహర్షి ॥ 64

ఉ॥ అంత, వసుంధతీసతి, యహల్యయు వహ్నులఁ దేర్చఁ గౌశికుం
డెంతయు సంతసంబున గ్రహించి, తదగ్నులు ప్రజ్వలింపఁ, గుం
డాంతరభూమిఁ జేర్చి, సకుశాస్తరణాష్టదిగుజ్జ్వలంబుగాఁ
బొంతల స్రుక్స్రువాజ్యహవిపుల్, సమిధల్, ప్రణీధుల్ విరాజిలన్

వ॥ వసిష్ఠోపదిష్టవిధానంబు సంతుష్టిం గూర్చుచుండ, విశ్వామిత్రుండు
సపత్నీకుండై, యభీష్టసిద్ధిం గోరి, యగ్నిసంస్కారంబులు, కుండ
సంస్కారంబులుం గావించి, సంస్కృతకుండంబులందు శ్రోత్రి
యాగారానీతంబులైన సంస్కృతాగ్నులం బ్రతిష్ఠాపించి, ప్రాగు
త్తరాగ్రంబులుగా బర్హిః పరిస్తీర్ణంబులు చతుశ్చతుర్దర్భలం దీర్చి
యగ్న్యుత్తరంబునం బ్రాగంతంబుగాఁ బ్రణీధాన్యాజ్యచరుస్థాలీ
ప్రోక్షణీశరావదర్వీస్రువజుహూపజుహ్వాదులన్ ద్వంద్వంబులుగా
నాసాదించి, ప్రోక్షణావోక్షణాభ్యుక్షణంబులు యథాసంభవం
బుగా నాచరించి, యుత్పవనాభిమంత్రణోత్తానీకరణపాత్రాదాన
ప్రోక్షణసంస్కరణాపూరణాక్షతాధానకుశాచ్ఛాదనోత్తరస్థాపనం

బులుగావించి, వసిష్ఠుండు ఋత్విజుండుగా. నగ్నులకు వత్సిణంబున దర్భాసనాసీనుండై యుండ, నా బ్రహ్మర్షిని సర్వోపచారంబులం బూజించి, ప్రార్థించి, యంతట, నాచమ్యపిలాపనసపవిత్రితతా త్రినిర్వపనోదగంగాధిశ్రియణజ్వలత్తృణస-దర్శనతిరఃపర్యగ్ని విధానోదగుద్వాసనాంగారప్రత్యూహోజ్యోత్పవన గంధివిత్రింజాప ఉపస్పర్శనకుశద్వయ ప్రహరణ స్రువాజ్యాగ్ని తాపన దర్భమార్జన పునస్తాపనపరిధిపరిధానా ఘారసమిద్దానేధ్మ మధ్యపరిషేచనాలం కరణాన్వాఘారాగ్ని ప్రతిష్ఠాభిధానాగ్ని ముఖకృత్యంబులు నిర్వర్తించి, వసిష్ఠానుజ్ఞాతుండై, "మహాక్షేత్రమహాసిందు ప్రీతిమిత్తం బుగాఁ బాశుపతహోమంబునాచరించువాఁడ"నని, సంకల్పించి, దృఢమనస్కుండై. విశ్వామిత్రుండు సుస్వరాక్షరభాస్వరం బుగా రుద్రగాయత్రి నుచ్చరింపుచు, నిత్యశుద్ధుండై, వేదోక్త మార్గంబున హోమంబు సేయనుద్యోగించి, వెండియు॥ 66

క॥ కుశికసుతుండును ముని స్వా
ర్వ శేయుఁడున్ శక్యమెలిగి, వక్కాణింపఁగ
బశుపతిభుజజనిముని ము
క్తశుభాఖ్యాశోభితుండు తద్దయు దీక్షన్॥ 67

ఆ॥ వ్రతము పాశుపతముఁ దతశుభఫలదాయి యాచరించె క్షేమమర్థిఁ గోరి
జానుమండలాభిధానదానవజైత్రికాంక్ష జేసి పారికాంక్షి మాళి॥ 69

వ॥ అని, తెలిపిన విని యవ్వలి వృత్తాంతం బెట్టి దని వీణాపాణి వాణీజాని నడుగుటయు॥ 69

క॥ సిరులిరవొందెడు నరసాపురమున నివసించు భక్తముఖ్యులకు నిత్యరమా వైభవముల్ మోక్షరసానందమును గూర్చు కపిలము పేశా

ఇది, ఆంధ్రీకృతము క్షేత్రోపాఖ్యానంబునందుఁ బాశుపత వ్రతారంభవర్ణనమను సప్తమాధ్యాయము.

శ్రీరస్తు

# ఆంధ్రీకృతముక్తీశ్వరోపాఖ్యానము

## అష్టమాధ్యాయము

ఆ॥ సిరులుమించుమేనసరులు పెన్గాలిచే
పరులుబూదిపూఁతవఱలునంగ
రాగ; మెన్నఁ దాఁగయాగంగసిగదంత
యమరలింగ! నీకవిమతభంగ !! 1

ఆ॥ అవధరింపు; మవలిదగుకథ; సురముని
నలువకనియె— "వినఁగవలఁతువిస్త
రంబుగాఁగసర్వమంబురుహాసనా
సీన! యీకథావిశేషమేను ॥ 2

మ॥ అమరారాతియెఱుంగనేయెఱుఁగఁడా? యమ్మాత్రిక్రిపక్షిప్రసి
ద్ధమహాదీక్ష, దృఢవ్రతాచరణవృత్తాంతంబు, దీన్నిన్; మహా
త్మం! మనోదరిక్తుఁడు, జానుమండలుఁడు; శుంభద్రాక్షసానీకవి
క్రిమముౕమాక్రికహానియెట్లుఁచె?విఘ్నధ్వంసమెట్లయ్యెనో!"

కం॥ అని, యడిగినతనతనయుని;
ముని, నారదుఁజూచి,తమ్మిపుట్టువుపొలివో
వని నరుసక "సవత్స"
మని, వినిచెఁగథావిధానమవ్వలిదిట్టుల్ ॥ 4

మ॥ మునిముఖ్యుండగుమాక్రికాఖ్యుడువ్రితంబుల్ గౌశికర్ష్యాశ్రమం
బానమైత్రావరుణిప్రదిష్టపథవిస్ఫూర్తింబ్రవర్తింపఁజే
సినవృత్తాంతముజానుమండలునివిన్చెన్ దుర్నిమిత్తాళి; వాఁ
డును, డిల్లంపడి, తేఱి, పంపెఁజరుఁదోడ్తోశుక్రురప్పింపఁగన్॥

చం॥ పనివిని, దూత వేగఁజని, భార్గవునాశ్రమసీమఁ జేరి, శు
క్రునిఁగని, మ్రొక్కరిల్లి, సుముఖుండగుటన్ మదిగుర్తెఱింగి, యే
లినగొరక ప్పు డేర్పడిన క్లేశము లేశముగామి, "సుంత దె
ల్పిన, నపచారమే మొ" యని, విన్నఁదనంబున మిన్నకుండినన్॥ 6

కం॥ శుచియుఁ, త్రికాలజ్ఞుండును,
బ్రచురతరతపః ప్రభావ ధావితభావ
ప్రచయగమనుండు, శుక్రుం
డుచితఫణితి, దూతఁజూచి, యూఱ్కొను కృపతోన్ ॥ 7

ఆ॥ సంభృతాస్థ, నాత్తగాంభీర్యుఁడై, శుక్రుఁ
డంత, మందహాసహారి ఘోర
ణీప్రశాంతసూక్తిదీప్రుఁడై చూచుఁ, ద
ద్రేష్యుఁజూచి, పల్కెఁ బ్రీతినిట్లు ॥ 8

కం॥ "దైత్యకులాధ్యక్షుండు, సా
మాత్యాత్మజభృత్యమిత్రమండలబంధుం
డాత్యక్తపడీత్యోర్ధ
త్యాత్యయుఁడే కద! యనామయం బే కదరా! ॥ 9

చం॥ మముఁదలపోయునే మదిని? మాప్రియశిష్యుఁడు, జానుమండలుం
డమరవిరోధి, స్వీయవిభవాతిశయంబున నెందానుమూఁడులో
కములనజయ్యుఁడై, మెలఁగి, శామితముల్ మితముల్, హితంబులై
తమినపఁప్రభుండు నిజధర్మము నిత్యము నిల్పుచుండు నే?॥ 10

కం॥ నీవెఱుఁగుదునే; నేపనిమావల్లనతండుదీర్ప మదినూహించెన్?
లేవేమియుఁ గోర్కులు రక్షోవీరున" కనుడు వాఁడు గొంకుచు ననియెన్

ఆ॥ "బుద్ధి-బుద్ధి; సామి! బుద్ధులు స్వామివి; యేనెఱుంగ నేరనింతయైన
మిమ్ముఁదోడితేర మేలైన యానయొక్కటియుఁ దక్క, తక్కు కత లెఱుంగ

కం॥ సేవాసఁగినఁబోయెద; మి
మ్ముల రమ్మనినాఁడు తేఁడు; మునివర! మీమా
పలుకులెఱిఁగింపనోరకును
సెలవిండవియేమొ, దేవ! చెచ్చెరనాకున్ ॥ " 13

మ॥ అనినన్, దానవదేశికోత్తముఁడు, శుక్రాచార్యుఁడా దూతకి
ట్లనె-"నారీ, సను డెంచుచుంటి మనుమా దామాట మీ తేనితో
డను లెస్సన్ వినిపింపఁబో"మ్మనఁగ, వేడ్కన్ వాఁడునుంబోయి, వి
న్చెను శుక్రానుమతంబు, దైత్యుఁడును, బ్రసన్నాత్ముఁడయ్యెన్ గడున్॥

వ॥ అసురగురుండును, సచ్ఛాత్రుండై, జానుమండలునిరాజధానిన్ జేరె; నంత, నక్కడ ॥ 15

ఉ॥ అంతకుమున్న చారుఁడు రహస్యములన్ గ్రహియించుపొంచు దే
వాంతకుపంపున జనినవాఁడు వచ్చి, నిజాధినాథుది
వ్యాంతికసీమఁ జేరి, వినయంబున దోసిలి యొగ్గి, సల్పి, నా
గంతుకు, వానిఁ జూచి, సురఘాతుకుఁ డిట్లను రాచఠీవితోన్॥ 16

వ॥ "ఓరోరి! నీ వెచ్చటెచ్చటం గ్రుమ్మరి వచ్చితివి? నీ వేమేమి చోద్యంబులు చూచితివిరా? నీచూచిన చోటుల నెవ్వరుం గాని, మా రాచఱికంబు మన్నింపక నన్ను మన్నినిఁగా నెన్నని వారు లేరు గా! లోకపాలురైనం గాని, మాఁడాకకుం జీకాకుఁ జెందుచుందురే కదా! నరసురకిన్నరగరుడోరగయక్షరక్షోబృందంబందఱు నందందతంద్రితులై, నక్తందివంబు మా యాజ్ఞ మీఱక, మా కిష్టంబులైన కార్యంబులే సూచరింపుచున్నవారే? ఎచ్చటెచ్చటి వీరాధివీరులున్ వీరోచితాత్మకృత్యాపదానంబులు తదేకతానంబుగా, గానంబులు సేయుఁ బుచున్నవారో కో! ఇఁక, మునిముఖ్యులైన మునులు మునుకలు-గినుకలు విడిచి, మనసులు కుదురుపఱచుకొని, తప

స్సమాసాదితంబైనమా వైభవంబుం బ్రస్తుతించుచుండుటమా నరుగాక మానరుగా! సకలచరాచరసముదయంబులు మాశౌర్యవీర్య ప్రాభవవైభవాదికంబు నధికంబుగ నభినందించుచు, మాయను గ్రహంబునకుం బాత్రింబుగాఁ గోరుచుందు రే? యేదీ నీనైపుణిం జూచెదముగాక; నీవారసివచ్చిన లోకవృత్తంబంతయు మా వీనుల విందు సేయు" మనవుఁడు, వఱువుఁడగువాఁడును, కృతాంజలియై, యిట్లనియె ॥ 17

ఉ॥ "భృత్యులు జీతబత్తెములు తేండ్లొసఁగన్, సుఖజీవులౌచుఁ, దా
మత్యయమేమి లేక, కడుహాయిగనుందురు; వాండ్లు తేండ్లకున్
బ్రత్యయఘాతుకత్వమున వర్తిలరాదుగదా! "ప్రభుల్ భువిన్
నిత్యము చారచక్షులని" నీతివిదుల్ వచియింపరే? దొరా!॥ 18

మ॥ భవదాజ్ఞం "దలపూవుగా" నిలిపి, శుంభద్భక్తి, యుత్సాహమొ
ప్ప, వడిన్ నేభువనత్రయాటనరహోవ్యాపారమే పారఁ, బో
యి, విశేషంబులు సూచివచ్చుటయు కాఁ దెన్నో రహస్యంబులుం
వివరింపం జగియున్నవన్నిటిని మన్నీఁడా! వినంగోరెదన్ ॥ 19

ఉ॥ అన్నియు విన్నవించెద, యథార్థములయ్యవి; నమ్ముఁడయ్య! నేఁ
జన్న ప్రదేశముల్ భవదసాధ్యమహత్త్వమహా స్వభాగ్యకీ
ర్త్యున్నతిగా, నపూర్వములు, నూర్జితహర్మ్యవిశాలముల్, ప్రభా
వోన్నయనప్రకాశములు నొచ్చెము లేనివి సమ్మతార్థ్యముల్॥

ఉ॥ తైజససంజ్ఞికంబులును, తామససంజ్ఞికముల్ జగంబులే
నోజఁ జరించి చూచితి; మహోన్నతముల్ గన, మీయశోమహ
శ్రీ విజయముల్ మనోనయనహృద్యములయ్యెఁ దలంప మీదనూ
శ్రీజుషముల్, కటాక్షముల రేఖలు గోరుదురెల్లరున్ దొరా ! 21

శా॥ ఉద్యోగించియు, దేవరఙ్గనక, నేనొక్కమ్మడిందొందఁగన్
సద్యోజృంభణమాచరించుటదికర్జంబౌనొ, కాదోయటం
"చాద్యావాపృథివీమహాంతరమునందామందులెందున్నఁదా
ముద్యత్సాహసులొచుఁగీడ్ప అతు''రంచూహించి, నేనాఁగితిన్

చం॥ అదియటులుంపని మొన్నపయఁడా! యటుమీఁదటముక్తమాని''గు
భ్యుదయముఁగూర్చి దేవతల, మూఁడుజగంబుల, మౌనిముఖ్యు న్
జదురునఁబ్రోతునే" ననుచు, శక్తినొకింతగడించుపొంటెఁదఁ
గదలెనుగౌశికాశ్రమముఁగాంచి, తదాజ్ఞహావంబొనర్పఁగన్॥
తదాజ్ఞను యజ్ఞకర్తగాన్॥ [పా]

శా॥ విశ్వామిత్రుఁడుమౌక్తికాఖ్యుఁగని, సంప్రీతిన్ శుభాశీర్వచ
శ్శశ్వద్వైభవశోభితాస్యుఁడయి, దీక్షాయుక్తుఁగావించి, య
జ్ఞశ్రేయసభాజిఁ జేయుటకునై సన్నాహముల్ దీర్పఁగా,
విశ్వాస్యంబనివార్యమౌ; దితిసుతున్ బీడించునంచాపఱున్॥

ఉ॥ నెమ్మదినమ్మియుండిరి; గణింపరుమిమ్మొకిమీఁద! కౌశికుం
"గిమ్మన''కుఁడఁ జేయుటయుఁ, గ్రించుఁదనమ్ము నమిఁచుమౌక్తికా
ఖ్యమ్ము నిముచ్చుగొ్రచ్చుటయు, నొక్కతఱింబచరింపఁగావలెన్
జుమ్మ! వసిష్ఠుఁడొక్కఁడఘనుండఁట! యజ్ఞము నిర్వహింపఁగన్

కం॥ ఇదిపాశుపతవ్రతమఁట!
విదితమహాదీక్షయఁట' వేల్పులు, మునులున్
'' గుదిబంపెగా '' దలంపరు;
సదవడఁ జేయంగమనము, చాకుఁదురొక్కో!॥ 32

కం॥ ఏమైనంగానిండో ధీమద్వర! మౌక్తికర్షి, దేవతలున్, దా
మామానులుగుంపై, విశ్వామిత్రాశ్రమమునందు శ్లాఘింతరొగిన్

కం॥ ఆశ్లాఘూవాక్కులునాక శ్లీలంబులుగఁదోఁచినంతఁ, ధీస
త్త్వశ్లథతకుఁగుఱియయిమదిసుశ్లోకా!యిప్పునిన్నుఁజూడన్ దేఁటన్॥

వ॥ ఇదియ, నేఁబోయిచూచివచ్చిన వృత్తాంతంబు. దీనిన్ విన్న
మీఁదట దేవరచిత్తంబునకువచ్చినతెఱంగునమీఁదికర్జంబునిర్ణయింపఁ
జను. ఇది యొకమనవి. నాయన్నమాటలయందోయన్న!
యేదేనికానిదిమీవీనులన్ జేరినల్లైన, దానింగానినుండానియోగిభావంబు
గాని నాడగాభావింపఁగాఁడనిమాటిమాటికి లెంకవిన్నవించు
కొనుచున్నవాఁడని" చెప్పి, యూరకుండెఁనంతనజ్ఞానమంతుండును
జ్ఞానవంతుండుఁగాఁడుగావున; దుష్టోద్ధాంధకారంబునన్ గన్నుఁగా
చిన్మ్రుచీకట్లుగ్రమ్మ దండతాడితోరగంబుతెఱంగున,నున్నచోట
నున్నట్టుండి, యువ్వెత్తుగలేచి, పండ్లుపటపటుగొఱుకుచు,
నుదిరిక్కుండు, నుత్సెక్కుండునై, పెండియు॥ 35

మ॥ అరరే! పూర్తికమానియెవ్వఁడురె?క్రవ్యాదోగ్ర్యధులారా!కళే
బరమున్ వానిదిప్రాతరాశముగసంపాదించితెండోరి!యు
ద్ధురులై;వాఁడొకవేళనింగికెగున్, దున్మ్రుఁడు; క్షోణీధ్రకం
దరలీనుండగుడున్, వధింపుఁడు; దిగంతంబుల్ వడిన్ జేఁటన్

ఉ॥ వారిధిలోనడాగిన, నవారితవేగమునన్ వధింపుఁడా
శౌరని,వారజాతభవు, శంకరుఁజేరినఁగాని, కొంకులేక
కారసి, పట్టిచంపుఁడు; నయంబునవానికదుష్టరక్తమున్
బోరనఁద్రావితేన్చుఁడికఁబొండు;జయంబునుగొండురక్కసుల్!॥

ఉ॥ దండిమగండె, వాఁడకట! దానవనాయకు, నన్నుఁబూరికిం
గొండికసేసి, నొంచునఁటె! కూళలు, వేల్పులునన్నుఁజంప,ము
క్కుండొకఁడుండెమాకనుచు, ధూర్తతఁబొంగుచునుండిరి;నేనికా
లుండనువానిపాలికని, లోకమెఱుంగునె నుంతయేనియున్?॥ 39

వ॥ అనిన, విని, మిగిలినదనుజులు సహామహామికలు ప్రకటించుచు, స్వాంభక్తితత్పరులై, మహోత్సాహంబుం జూపుచు జానుమండలుని సంతుష్టచిత్తుంగా వింపుచుం, బ్రస్థానోద్యోగంబుం జూపుచుండిరంత॥

మ॥ కనవచ్చెన్ బ్రియశిష్యశుక్రుఁడును, ద్రాక్కార్యంబునొక్కంతసం
తసనూహించియు, 'జానుమండలుని చిత్తంబుత్తలంబొందెనో!
యనిమిత్తంబుగ భృత్యసంఘునె? యతండుం'' చున్ విచారించి, తా
ననుమానించినయట్లె యయ్యెనిట దైత్యస్వామియుద్యోగమున్

ఉ॥ వచ్చియు, రాకముందె తనపాదములం బడు జానుమండలున్
గ్రుచ్చి కవుంగిలించుక, భృగుప్రవరుఁడు మృదూక్తిఁ దన్వి "య
భ్యుచ్చయసిద్ధిరస్తనుచు" నుత్కలికోన్నతి దైత్యనందనా
సచ్చరితుం డెలుంగుచుం, బ్రశాంతునిఁ జేయుచు, నల్లనల్లనన్ 47

శా॥ "ఓయీ, దైత్యకులావతంస! సమరోద్యోగంబు గాఁదోఁచెడున్
నీయీవైభవమున్, బ్రభుత్వము నుమన్నింపన్ సురల్ ధిక్కృతిన్
జేయర్గా! భువనంబులెప్పుడును నిశ్శేషంబుగా, నీకృపా
మేయాపారదృగంచలప్రసరకీమ్రార[గంభీర]ప్రభాఽఽఢ్యంబులే?

ఉ॥ నీదు నవక్రవిక్రమ మనింద్యనిజక్రమమంచు, మాపయిన్
భేదములేని భక్తియు, వినీతియు లెక్కకు నెక్కుడంచు, స
మ్మోదముఁ జెందియుందుము; మముం బిలువంబని యేమి? మే మెశి
ష్యాదరబద్ధబుద్ధిమెయి, నాత్మఁదలంతుము నిన్ గనుంగొనన్॥ 51

సీ॥ జానుమండల! దైత్యచక్రవర్తీ! మదం
తేవాసులం దెల్ల నీవ మాకుఁ
గూర్చువాఁడవు; మనఃక్షోభంబు నీకేల?
నీపిల్పు తుష్టిఁ బొందించె మమ్ము;
సెప్పుమిప్పుడు నెందు సేమంబె కద! నీకు
సప్తాంగసామ్రాజ్యచక్రమందు?
మంత్రివర్గమును, సామంతరాజులు విధే
యులుగనుందురె? నిజోద్యోగమందు

ప్రవర్తింపుచుందువే? సేవితంబె
ధర్మకామార్థవర్గంబు? ద్వాదశారి
మండలపరీక్ష లొప్పగునే? బాంధవవృద్ధి,
సైన్యవృద్ధియుఁ జేయుదే? మాన్యశీల!॥ 56

తురంగసైన్యంబుఁ జతురుండవౌచు, సం
పాదనసేయుదే? మంత్రవేత్త
ాగురూత్తముల, నిష్ఠాగరిష్ఠులఁగుల
క్రమమునవచ్చువారఁ భజింతె?
వస్త్రనిర్ణేజకుల్, పాచకుల్, శిల్పులు,
శస్త్రాద్యధికారులు, శాలలందు
ధికృతుల్ యోగ్యులే? విధినిర్వహణదక్ష
శీలురే? శుద్ధవంశీయులే క
! మదంతికశుశ్రూషచే మహిష్ఠ
ాభములు నీకుఁ జేకూరునే? భవిష్య
ంతఁ గవర్తింతె? యొందుఁ దొందఱయులేక,
ానుమండల! రాక్షసచక్రవర్తి!॥ 57

నురప్పించిన హేతువేమి? దితిపుణ్యపరిష్ఠ! నిష్ఠాగరి
! నినుంబొందెదుఁ జుమ్మ! దిగ్విజయదీక్షాలక్ష్మి; రక్షస్సము
ానితాంతస్థిరశోభ; నీ కగుపరిభుత్వైకాప్తి "శ్రీరామర
ను" గాంచుం జుమి; వేఱుగాదు ప్రియ సిష్యా! శంకలన్ దక్క మాఁ

వ్యాసాపాయనంబుగాఁ జేతోమోదమేదురంబుగాఁ, గర్తవ్య
ష్ఠాసంబరిస్ఫుటంబు సేయుచుం. బల్కినగురాచార్యునకు దైత్య
ర్యుం డిట్లనియె॥

